సంపుటము 26 శ్రీ సంచిక 5

ఆంధ్రరాష్ట్ర

# ప్రారంభవిద్య

(విద్యావిషయిక మాసపత్రిక)

డిశంబరు 1937.

సంపాదకులు:— శ్రీయుత జోశ్యుల వెంకటావుగారు, బి.ఏ., బి.యిడి.



## విషయసూచిక.





వ్యవస్థాపకులు: శ్రీయుత ఈదరవెంకయ్యపంతులుగారు, ప్రొప్రయిటరు, రామా అండ్ కో., ఏలూరు.

సంవత్సర చందా రు 1-8-0 (పోస్టేజితోసహా)

Printed by Mr. E. Venkayya Pantulu at his Pattabhirama Press, Ellore.

ఆంధ్రరాష్ట్ర

# ప్రారంభవిద్య

విద్యావిషయిక మాసపత్రిక.

| సంపుటము 26 | ఏలూరు—15 డిశంబరు 1937. | సంచిక 5 |
|---|---|---|



"సరస్వతీ నమస్తుభ్యమ్ వరదేకామరూపిణి
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతుమేసదా."

## ప॥ గో॥ జిల్లా ఎడ్యుకేషనల్ కాన్ఫరెన్సు.

### వార్కేగారి ఉపన్యాసము.

ఏలూరు మ్యునిసిపల్ హైస్కూలు భవనముందు ప్రత్యేకముగ నిర్మింపబడిన విశాలమైన పందిటలో డిశెంబరు 6 వ తారీఖున ఉదయం సుమారు 8-30 గంటలకు మన చెన్నరాష్ట్ర విద్యాశాఖా మంత్రిగారికి పార్లమెంటరీ శెక్రటరీగానున్న శ్రీయుత సి. జె. వార్కే, ఎం ఏ. ఎం. ఎల్. ఏ. గారితో విద్యా విధానమును గూర్చి చర్చించుటకు పశ్చిమ గోదావరిజిల్లా ఎడ్యుకేషనల్ కాన్ఫరెన్సు జరుపబడెను. జిల్లా అంతటినుండియు పెక్కుమంది మాష్టర్లునూ, స్కూళ్ళ మేనేజర్లునూ సభకు వచ్చియుండిరి. సభలో ఎలిమెంటరీస్కూళ్ళ టీచర్లకునూ, టీచరు మానేజర్లకునూ, శెకండరీస్కూలు టీచర్లకునూ, ట్రయినింగుస్కూలు విద్యార్థులకునూ, ఏలూరు పౌరులకునూ స్త్రీలకునూ ప్రత్యేక స్థలములు ఏర్పాటుచేయబడెను. హైస్కూలు విద్యార్థులు నలుబదిమంది వాలంటీరులుగ నుండి సభికులకందరకును వారివారి స్థలములజూపియు, వారివారి సైకిళ్ళను ఒకచోట లైనుగనుంచి వాటివద్ద కావలియుండియు, మరియు ననేకవిధముల సభకు సహాయులైరి.

శ్రీయుత వార్కేగారు సభకు రాగానే, తెల్లని ఖద్దరు టోపీలను ధరించిన ఐదుగురు విద్యార్థులు, సభలోని వారందరును నిలుచుండియుండ, చక్కనిస్వరముతో "వందేమాతరం"ను పాడిరి. పిమ్మట పశ్చిమ గోదావరిజిల్లా డి ఇ ఓ. గారయిన శ్రీయుత డి. దామోదరం మొదలి

యార్ గారు ప్రొఫెసర్ వార్కే-గారికి జిల్లాతరఫున స్వాగతమిచ్చుచూ, మదరాసు రాష్ట్రములోని విద్యాశాఖ, ప్రౌఢ విద్యావేత్తలయిన ముప్పురిచేతులలోనుండుటనుబట్టివిద్యావిధానము గొప్పదశకు రాగలదనియు, రాష్ట్రములోని ఉపాధ్యాయులు ధన్యులనియు, ఆ ముప్పురు విద్యావేత్తలును గౌ॥డా॥ సుబ్బరాయనగారును, ప్రొఫెసరు వార్కే-గారును, డైరక్టరుగానున్న శ్రీయుత ఆర్. యమ్. స్టాదాంగారును అనియు చెప్పి, వార్కే-గారిని తమజిల్లాకు తీసికొనివచ్చుటకు ముఖ్యకారకులు శ్రీయుత మాగంటి బాపినీడుగారేఅని సభవారికి తెలియజెప్పి బాపినీడుగారిని నాటిసభకు అధ్యక్షులుగా నుండవలసినదిగాకోరిరి.

అంత, మదరాసు రాష్ట్రపు పబ్లిక్ ఇన్ఫర్మేషను శాఖామంత్రిగారి పార్లమెంటరీ శెక్రెటరీగానున్న శ్రీయుత మాగంటి బాపినీడుగారు తమ ప్రారంభోపన్యాసము నిట్లిచ్చియుండిరి. "రోజులు మారిపోవుచున్నవి. మన రాష్ట్రములోని ప్రభుత్వములో వచ్చిన మార్పులవల్ల అనేక విషయములలో మార్పులువచ్చుట సహజము. విద్యావిషయములో కూడ మార్పులు తప్పవు. భావికాల పౌరులను తయారుచేయు ఉపాధ్యాయులు కూడ కాలగతినిబట్టి మారిపోవలసియున్నది. గొప్పగొప్పత్యాగములేవియు ఉపాధ్యాయులు చేయనక్కరలేదు సరియైన విషయములను, సరియైన పద్ధతులలో ఉపాధ్యాయులు విద్యార్థులకు బోధించిన చాలును. ఈ సందర్భమున ఉపాధ్యాయులు గుర్తించవలసిన విషయము నొకటి చెప్పదలచినాను. మీరు ముందు మంచి విద్యార్థులయి, మీచుట్టు పత్రికల జరుగుచున్న మార్పులను గూర్చి నేర్చుకొనుచుండిన గాని, మంచి ఉపాధ్యాయులుగ నుండలేరు. మీరు దూరదృష్టిని, విశాల హృదయమును కలిగియుండుటవసరము. అప్పుడు గాని విద్యార్థులను మీరాకర్షింపలేరు" ఈ విధముగ కొంతసేపు ఉపన్యసించిన పిదప అధ్యక్షుడు విద్యాసంస్థలను ప్రొఫెసరు వార్కే-గారికి తామీయనున్న మెమోరాండంను చదువవలసినదిగా కోరిరి.

మొట్టమొదట వెంకటాద్రిమ్ అండ్ కో వారి తరఫున స్వాగత పద్యములు చదవబడెను. తరువాత ఏలూరు మ్యునిసిపల్ హైస్కూలు ఉపాధ్యాయ సంఘమువారి స్వాగత పత్రము చదువబడెను. మిషనువారి వద్దనుండి మ్యునిసిపాలిటీవారు హైస్కూలును తీసుకొనినప్పటి నుండియు ఏడాదికి నూరు రూపాయలు మాత్రము గవర్నమెంటు గ్రాంటుగా నుండుటచేత మ్యునిసిపాలిటీవారు ఏటేట చాలా సొమ్మును స్కూలుకు ఖర్చుపెట్టవలసివచ్చి అప్పుడప్పుడు జీతములలో కోతలువెట్టుటే కాక, అవసరమైన ఎక్విప్మెంటును బిల్డింగులను చేకూర్చలేకపోవుచున్నదని అడ్రసులో చదువబడెను. పిమ్మట పశ్చిమగోదావరి జిల్లా ఉపాధ్యాయ సంఘమువారి మెమోరాండం చదువబడెను. దానిలోని కొన్ని సంగతులివి. "గవర్నమెంటువారు సెకండరీ ఎడ్యుకేషనును రిఆర్గనైజు చేయదలచుట మాకు చాల సంతసముగ నున్నది. కాని ఆవిషయములో కొన్ని సూచనలను చేయదలచినాము. ఇప్పుడున్న సెకండరీస్కూలు కోర్సును మరొక ఏడాదివరకు పొడిగించుట మాసంఘమొప్పుకొనదు. మిడిల్స్కూలు కోర్సు ఆఖరున గవర్నమెంటు పరీక్షను కూడ మా సంఘమంగీకరింపదు. మిడిల్స్కూలు కోర్సు అయిన తరువాత చేతిపనుల నేర్పు క్లాసులును, కాలేజీకి తయారుచేయు క్లాసులును వేరుచేయబడి నప్పటికిని పరిశ్రామిక విద్య ఒకరకపు స్కూళ్ళలోనే కాక అన్ని బడులలోనూ నిర్బంధముగా

ప్రవేశపెట్టుట మంచిదని మా సంఘముయొక్క అభిప్రాయము. ఈ సందర్భమున పరిశ్రామిక విద్యాలయములను గూర్చి ఎక్కువగా మాకు తెలియపరచ వలసినదిగా మిమ్ముకు నేము కోరుచున్నాము. నిర్బంధముగా ఒకటి, రెండు, మూడు ఫారంలలో హిందీని ప్రవేశపెట్టుట మాకు చాల యిష్టము, కాని యితర సబ్జెక్టుల లోని కోర్సులను కొంచెము తగ్గించుట మంచిది. లోకల్ బోడీలకు చెందిన ఎలిమెంటరీ స్కూళ్లను సెకండరీస్కూళ్లను కూడ గవర్నమెంటువారే స్వాయము గనడుప సమకట్టుట మాకు చాల తృప్తి కరముగనున్నది, కాని ప్రస్తుతము లోకల్‌బోడీల పాలనలోనిస్కూళ్ళ ఉపాధ్యాయుల హోదాలు ఎట్లు మారునో మాకు తెలియంరచగోరుచున్నాము. ఉపాధ్యాయవృత్తి కడు బీదవృత్తి. దానికి తోడు ప్రయివేటు స్కూళ్ళలోను లోకల్‌బోడీల స్కూళ్ళలోనూ కూడ జీతములను సకాలమున కీయకున్నారు.పైగా జీతములలో కోతలు. 4 మొదలు 8 నెలల జీతములు బకాయిపడిన స్కూళ్లు మా జిల్లాలో నున్నవి. ఈ విషయములో గవర్నమెంటువారు తగుచర్య తీసుకొనవలసి యున్నది. జి. ఓ. నెంబరు 4619 అమలులోనికి వచ్చిన తర్వాత తక్కువ జీతములు స్థిరపరుప బడినవి గాన, దీనిపైన యింకనూ కోతలవెట్టుటకు ఏస్కూలు మానేజిమెంటునకునూ గవర్నమెంటువారు తమ అనుమతినీయరాదు. ప్రత్యేకముగ ప్రయివేటుస్కూళ్లపరిపాలన చాలఅన్యాయముగనున్నది. వాటిలోని ఉపాధ్యాయులు అనేక విధములుగా అణగదొక్కబడుచున్నారు. సరియైన ఎక్విప్మెంటు ఏస్కూలుకునులేదు. అటువంటి స్కూళ్ళలో తయారైన విద్యార్థులు చాలా నాశిరకమనుటలో ఆశ్చర్యములేదు. అందువల్ల గవర్నమెంటువారు తమ గ్రాంటు-ఇన్-ఎయిడ్ కోడ్డును విశాలహృదయముతో రివైజుచేసినగాని ఫలముండదు. ప్రోవిడెంటుఫండు విషయములో గవర్నమెంటు కంట్రిబ్యూషనును ఎక్కువచేసి, డిపోజిట్‌లమీద వడ్డీరేటునునూటికి 4½ గా చేయవలసినదని కోరుచున్నాము."

తరువాత పశ్చిమగోదావరిజిల్లా "నాన్‌మిషన్ ఎయిడెడ్ ఎలిమెంటరీ టీచర్ మేనేజర్స్ అండ్ మానేజర్సు అసోసియేషను" వారి మెమోరాండంను, "ఏలూరు రేంజి నాన్‌మిషన్ ఎయిడెడ్ ఎలిమెంటరీ టీచరు మేనేజర్లసంఘము" వారి వినతిపత్రమునూ చదువబడినవి. వాటిలోని కొన్ని విషయములివి. "విద్యావ్యాప్తికి తోడ్పడు సంస్థలు మూడు. అవి లోకల్‌బోర్డులు, మిషను వారు, నాన్‌మిషన్ ప్రయివేటు మేనేజర్లు. ఈ మూడు సంస్థలలో మూడవవారి యాజమాన్యమునయున్న పాఠశాలలసంఖ్య అత్యధికము. అందువల్ల గవర్నమెంటువారు మమ్మును త్రోసిపుచ్చక యితరసంస్థలతో పాటైనను మాకు గ్రాంటుల నీయవలసినదిగా కోరుచున్నాము. ఇన్‌కంప్లీటు ఎలిమెంటరీ స్కూళ్లను తీసివేసిన విద్యావ్యాప్తికి చాలా ఆటంకములు కలుగును. ఇన్నిసంవత్సరములనుండి ఇన్‌కంప్లీటుగానే ఎలిమెంటరీస్కూళ్లు ఉండుటకు మేమెంతమాత్రమును కారణముకాదు. దేశదారిద్ర్యమును, తల్లిదండ్రుల విముఖత్వమును, తగిన ప్రోత్సాహము లేకపోవుటయూ నిర్బంధవిధాన మనులులో లేకపోవుటయునూ కారణములు. మదరాసు లెజిస్లేటివ్ అసెంబ్లీవారు ఏర్పరచిన సబ్‌కమిటీ రిపోర్టును బట్టి చూడగా జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిళ్లను ఎత్తివేసి, వాటిస్థానే క్రొత్తసంస్థల స్థాపించి, వాటిలో జిల్లా రివిన్యూ అధికారులను అధ్యక్షులుగా నియమించునట్లు సూచన కనబడుచున్నది. ఇది సమంజసముకాదు అట్టి క్రొత్త సంస్థలలో మాకు ఎక్కువ ప్రాతినిధ్యమిప్పించ గోరుచున్నాము గాంధి మహాత్ముడు

సూచించిన విద్యావిధానము చాలా గొప్పదై నను ఆచరణలో మిక్కిలి కష్టసాధ్యమని యెంచు చున్నాము."

తరువాత ఆంధ్రరాష్ట్ర హిందీ సంఘము వారునూ, వారి తరువాత తణుకు తాలూకా ఎలిమెంటరీ స్కూలు మాష్టర్లసంఘమువారునూ తమ తమ ఎడ్రెస్సులను చదివిరి.

పిమ్మట అధ్యక్షుని అనుమతితో, ఏలూరు మ్యునిసిపల్ కౌన్సిలరు అయిన శ్రీమతి శృంగార కవి లక్ష్మీనరసమ్మగారు లేచి యిట్లు మాట్లాడిరి. "ఇన్ని ఎడ్రెస్సులలోనూ కూడా బాలికల విషయమై ఏమియును లేకపోవుటచేత నేను ముందుకువచ్చి మాట్లాడవలసి వచ్చినది. బాలికల విద్యావిషయములో ఎంత అశ్రద్ధగ నున్నామో దీనినిబట్టియే తెలియుచున్నది. ఇంత పెద్దపట్టణములో బాలికలకు హైస్కూలు లేకపోవుటొక పెద్దలోటు. బాలురకున్న హైస్కూలులో బాలికలను చదివించుట చాలా కష్టముగానున్నది. వెంటనే ఏలూరులో బాలికలకొక హైస్కూలును స్థాపింపవలసినదిగా ప్రొఫెసరు వార్కేగారిని కోరుచున్నాను."

అంత అధ్యక్షులైన బాపినీడుగారు లేచి, "వార్కేగారు మనయూరిలో నడుగుపెట్టగానే బాలికల హైస్కూలు సంగతిని నేనే వారితో మనవి చేసియున్నాను. బాలికల విద్యవిషయమై మేమెవ్వరమును శ్రద్ధపూనుటలేదనిలక్ష్మీనరసమ్మ గారు తలువ నక్కరలేదు." అని ఆమెకు సమాధానమిచ్చి ప్రొఫెసరు వార్కేగారిని మాట్లాడ వలసినదిగా కోరిరి.

అప్పుడు వార్కేగారీవిధమున మాట్లాడిరి. "మన దేశమునకునూ,ఇక్కడ సమావేశమైయున్న వారిలో పెక్కుమందికిని పరాయి దయిన ఆంగ్ల భాషలో మాట్లాడవలసి వచ్చినందులకు చింతించుచున్నాను. హిందీ దేశీయభాష అగునంత వరకు పరాయి భాషకు బానిసలము కాక తప్పదు. అట్టిదినము తొందరలోనే రానున్నదని నమ్ముచున్నాను. ఈకాన్ఫరెన్సు యింత ప్రశాంతముగను, నియమ బద్ధములతోనూ, మనస్సున కానందము చేకూర్చునట్లును ఏర్పాట్లను చేసిన వారినందరిని నేనభినందించు చున్నాను. మీటింగులలో నింత నియమమును, క్రమశిక్షను చూపగలిగిన సమావేశములను మాదక్షిణ దేశమున నేను చూడనేలేదు. మనలో క్రమశిక్ష లేకపోవుట చేతనే పరదేశీయులకు బానిసలముగ నున్నాము. మన పనులను మనమింత చక్కగ నెఱవేర్చుకొనుటయే స్వతంత్రసంపాదనకుదారి."

"మ్యునిసిపల్ హైస్కూలు ఉపధ్యాయ సంఘమువారు నాకొసంగిన స్వాగతమునకు కృతజ్ఞుడను. ఈస్కూలున కిచ్చుగ్రాంటు నూరు రూపాయలను హెచ్చింప వలసినదనియు, అంత తక్కువ గ్రాంటు నిచ్చుటచేతనే స్కూలును నడపుట మ్యునిసిపాలిటీకి కష్టముగా నున్నదనియు మీరు చదివినది వినియున్నాను. బోర్డులకు చెందినట్టియు, మ్యునిసిపాలిటీలకు చెందినట్టియూ ఎలిమెంటరీ పాఠశాలలను, సెంకడరీపాఠశాలలను గవర్నమెంటువారే తీసికొని తామే నడుపుటకు నిశ్చయించుచున్నారు. అందుచేతనీ స్కూలును సక్రమముగా నడుపుట కెంతసొమ్ము కావలెనో అంత సొమ్మునూ గవర్నమెంటువారు తప్పక ఖర్చు చేయుదురు. వెంటనే మీయితర బాధలు కూడ నివారణ కాగలవు. చాలా లోకల్ బోడీల పరిపాలన లోనున్న స్కూళ్లలోని యిబ్బందులను, అన్యాయములను సవరింపబూనుటకన్న గవర్నమెంటువారిచే వాటిని ఒకేవిధముగా నడిపించుటే వీలయిన పనిగా మాకు తోచుటచేత నిట్లు నిశ్చయింప వలసివచ్చినది."

"జిల్లా ఉపాధ్యాయ సంఘమువారి మెమోరాండం నిజముగా చాలా పెద్దదిగా

నున్ననూ విషయములన్నియు సమగ్రముగా చర్చింపబడినవి. సెంకడరీ కోర్సును మరొక ఏడాది పొడిగించుట మీకిష్టము లేదనుచున్నారు. మీకెందుల కిష్టములేదో తెలిసికొనగోరుచున్నాను. దానివిషయమై ఇంకనూ స్థిరముగా మేమేమియు ననుకొనలేదు. కాని దీని కభ్యంతరమెందుల కుండవలెనో తెలియకున్నది. ప్రస్తుతము హైస్కూళ్లలో తయారగుచున్నవారికి ఉద్యోగ సంపాదనకు కావలసిన విద్యచేకూరుట లేదని మీరందరును ఎఱిగిన విషయమే. తల్లిదండ్రుల సొమ్ము వృథాకాకుండా హైస్కూలులో నేర్చిన విద్యతో ఉద్యోగమున కర్హులుగా విద్యార్థులజేయు నుద్దేశ్యముతోనే సెంకడరీకోర్సును పొడిగించుటపైగా పరిశ్రామిక విద్యను కూడ నీయదలచుట చేత కోర్సును కొంత పొడగించుట అవసరము. కాని, ఇకముందు స్కూలును వదలగానే, విద్యార్థికి తన పొట్ట తాను పోసుకొనగల సామర్థ్యత తప్పక వచ్చునని మాత్రము రూఢిగ చెప్పగలము. మిడిల్ స్కూలు కోర్సు కాగానే పబ్లికు పరీక్షను పెట్టుట కూడ మీసంఘమునకు తృప్తికరముగ లేదని మీరు తెలిపినారు. కాని, మిడిల్ స్కూలుకోర్సు కాగానే జరుగు పరీక్ష, ఇప్పుడు జరుగుచున్న గవర్నమెంటు పరీక్షవలె నుండునని మీరుభయపడ నక్కఱలేదు. పరీక్షకు పూర్వపు రెండు మూడు సంవత్సరములలో విద్యార్థి యొక్క బాగోగులునూ, బహుశః ఓరల్ పరీక్షయుకూడ పైన చెప్పిన పబ్లికు పరీక్షలో భాగములుగ నుండును. ఇట్టి పరీక్ష విద్యార్థి పరిశ్రామిక విద్యకు పనికివచ్చునో యూనివర్సిటీ విద్యకు పనికి వచ్చునో నిర్ణయించుటకు మాత్రమే జరుపబడును."

"పరిశ్రామిక విద్య నన్నిరకముల స్కూళ్ళలోనూ ప్రవేశపెట్టుట మంచిదని మీరు సూచించియున్నారు. గవర్నమెంటువారి అభిప్రాయము కూడ నదియే. మిడిల్ స్కూలు కోర్సు అయిన తరువాత పిల్లలను పరిశ్రామిక విద్యనిచ్చు పారశాలలలోనికి గాని, యూనివర్సిటీ విద్యకు తయారుచేయు పారశాలలలోనికిగాని తీసికొందురని ఉన్నదికాని, ప్రతి రకపు పారశాలలోనూ రెండవ రకపు విద్యకూడ కొంత యీయబడును. అందువల్ల కొంతవరకు చేతిపనులను చేయుట తెలిసిన విద్యార్థులును, బాగుగా విద్య తెలిసిన పనివాండ్రును దేశములోతయారుకాగలరు. అదియే మనము కోరునది."

"హిందీని 1, 2, 3 ఫారంలలో నిర్బంధముగ ప్రవేశపెట్టుటను మీరందరును ఏకగ్రీవముగా నామోదించి నందులకు నాకు సంతోషముగ నున్నది. మన రాష్ట్రములోని యితర భాగములలో నీవిషయములో కూడ భేదాభిప్రాయము లున్నవి. తమిళ భాషాప్రియులు చాలామంది యీ స్కీమునకు వ్యతిరేకులుగనున్నారు. తమిళ భాషను ప్రేమించినంత మాత్రమున హిందీని అసహ్యించుకొన నక్కఱలేదు. మనము ఒకటికంటె ఎక్కువభాషలను ప్రేమించిన తప్పులేదు. మీలో తెలుగు భాషను ప్రేమించువారనేకు లుండవచ్చును. మీరందరును హిందీని కూడ కావలెనని కోరుట సమంజసముగ నున్నది. ప్రస్తుతము మనము ఆంగ్లభాషకిచ్చు మొదటిస్థానమును తెలుగు భాషకును, ప్రస్తుతము మనము తెలుగున కిచ్చు రెండవ చోటు హిందీకిని, ప్రస్తుతము మనము హిందీకిచ్చు మూడవ చోటును ఆంగ్లమునకును యీయవలసియున్నది. ఇకముందు మనము మన మాతృభాషలలో కవీశ్వరులము కూడ కాగల శక్తిని సంపాదింపగలము. మాతృభాషకు ముఖ్యస్థానమిచ్చుటచేత మన శక్తులను మనము ఆభాషలో వ్యక్తిగతము చేసికొన గలుగుదుము. హిందీకి రెండవస్థాన

మిచ్చుట చేత దేశ వ్యవహారముల నాభాషలో ఇతర రాష్ట్ర ప్రజలతో చర్చించి వారితో పరిచయము చేసికొని ఐక్యతగా నుండుటకు వీలగును. ఆంగ్లభాషను నేర్చుకొనుట మిక్కిలి కష్టమైన పని. ఆభాషలోని అక్షరములకు స్థిరమైన ధ్వనిలేక సందర్భముల బట్టి మారుటచే భాషను స్వాధీనము చేసికొనుట కెంతవారికైనను ఎంతో కాలము వృధాకాకతప్పదు. మన దేశభాషలేవియును అట్లుకాదు. వాటిని నేర్చుకొనుట బహు తేలిక."

"ప్రయివేటు స్కూళ్ళలోని ఉపాధ్యాయుల బాధలనుగూర్చి మీరిచ్చిన మెమోరాండంలో చదివియున్నారు. వారికి జరుగుచున్న అన్యాయములను నేనుబాగుగ గుర్తించియే యున్నాను. వారిబాధలు రెండురకములు. ఉద్యోగమునుండి తొలగింపబడుదుమను భయమొకటి. జీతము కోతలతోనైనను సకాలమునకు రాకపోవుట యొకటి. మేనేజరువారి కటాక్షవీక్షణములలో నున్నంతకాలమే ఉద్యోగముచేయుట. మేనేజరుకు ఏవిషయములో కోపము వచ్చినను (ఈకోపము ముఖ్యముగా మేనేజరు కోరినవారికే ఎలక్షనులలో వోటునీయకుండుటవల్లనే వచ్చును) ఉద్యోగమునకెసరు వచ్చిన దన్నమాటే. మానేజర్లకునూ, ఉపాధ్యాయులకునూ యిట్టి పరస్పర కక్షలుండుటచేత వీరిద్దరిమధ్య అన్యాయముగ కుఱ్ఱవాళ్ళ చదువు పాడగుచున్నది. వీరిద్దరి సహకారమువల్లగాని సరియైన మార్గమున పిల్లలకు విద్యగఱుపబడజాలదు. ఇక, ప్రయివేటు స్కూళ్ళలో ఉపాధ్యాయుల జీతములు బహు తక్కువ. ఆతక్కువజీతముకూడ సకాలమునకు రాదు. 4 మొదలు 8 నెలలవరకునునూ జీతములబకాయిలున్నవని వినుటకు చాలావిచారముగ నున్నది. అణగద్రొక్కబడు చున్నారనుట కింతకన్న అధారమేమి కావలెను? నేనునూ ప్రయివేటు మానేజిమెంటువారికిక్రింద పనిచేసినవాడనే. నేనక్కడినుండివచ్చి యీపదవిని స్వీకరించుట, నేను పాఠములు చెప్పలేకపోవుటవల్ల కాదు. నిజముగ ఈఅధోగతిలోనున్న ఉపాధ్యాయులను పైకి లేవనెత్తుటకేఅని మీరునమ్మవచ్చును. మాకిప్పించెడు జీత మెంతస్వల్పమైనదైననుసరే సకాలమునకిప్పించి మమ్ము కాపాడుడనెడు ఘోష ప్రయివేటుస్కూళ్ళనుండి ఎక్కువగా వచ్చుచున్నది. పెద్దజీతముల తీసికొని పనిచేయనివారిని అణగద్రొక్కి, స్వల్పజీతములతో తృప్తిపడి గొప్ప సేవచేయు ఉపాధ్యాయుల పైకి లేవదీయవలసియున్నది."

"లోకల్‌బోడీలకు చెందినస్కూళ్ళను గవర్నమెంటువారు తీసికొనినప్పుడు, అట్టి స్కూళ్ళలోని ఉపాధ్యాయుల హోదాలలోనేమి మార్పు వచ్చునో తెలుపవలసినదిగా మీరుకోరినారు. ప్రస్తుతము గవర్నమెంటు స్కూళ్ళలోని ఉపాధ్యాయులెట్లు పరిగణింపబడుచున్నారో అట్లే మీరును పరిగణింపబడగలరు. కాని, సర్వీసు ప్రావిన్షలైజు అగునోకాదో ఇప్పుడు చెప్పజాలను. అట్లుచేసిన రాగలసాధకబాధకములను తెలిసికొనవలసి యున్నది."

"ప్రావిడెంటు ఫండు విషయములో గవర్నమెంటు కంట్రిబ్యూషనును ఎక్కువచేసి, బోనస్ మీద వేయు వడ్డీ రేటును హెచ్చింపవలసినదిగా మీరు కోరినారు. ప్రస్తుతపు వడ్డీ రేటు మిక్కిలి తక్కువగా నున్న సంగతి నిజమే. దానిని హెచ్చించుటకు ప్రయత్నములను చేయవచ్చును. కాని, కంట్రిబ్యూషనును కూడ ఎక్కువచేయుట ప్రస్తుత పరిస్థితులలో దుర్లభము."

"టీచరు మేనేజర్ల సంఘముల మెమోరాండంలు రెండునూ ఒకే విధమయిన బాధలగూర్చి చెప్పుచున్నవి. కాన, వాటి రెంటికినీ కలిపి ఒకే సమాధానము నిచ్చుచున్నాను.

నిమ్మును టీచరు మేనేజర్లనుట కంటె మేనేజరు టీచర్లనుట ఎక్కువ సమంజసము. మీకు మేనేజరు పని ముందు. టీచరు పని తరువాత. ఏది ముందైనను రెండునూ ఒకరిలో కలిసి ఉండుట చాలా ఉత్కృష్టమైన పద్ధతి. కాపిటలిస్టులునూ, కూలిచేయువారునూ దెబ్బలాడుట దేశమునకు లాభము కాదు. వారిరువురును కలిసి గాని దేశము నుద్ధరింపలేరు. ఆవిధముననే మేనేజర్లును టీచర్లునూ కూడ విద్యావ్యాప్తికి అవసరమే. వీరిద్దరునూ ఒకరిలోనే యిమిడి యుంటట మరీ మంచిది. ఇన్‌కంప్లీటు స్కూళ్ళను సింగిల్ టీచరు స్కూళ్ళను గవర్నమెంటు వారు తీసివేయదలచుటలో తప్పులేదు. అట్టి స్కూళ్ళ అవసరము మూలమూలల నున్న పల్లెలలోనే ఎక్కువగా నుండునని గవర్నమెంటు వారికి తెలియకపోలేదు. ఏమాత్రము కొంచెము పెద్ద ఊరయినప్పటికినీ, అందు ఇన్‌కంప్లీటు స్కూళ్ళకు గాని సింగిల్ టీచరు స్కూళ్ళకు గాని తావుండరాదు. అందుచేత పట్టణాళ్ళలోని ఇన్‌కంప్లీటు స్కూళ్ళ నన్నిటిని గవర్నమెంటు వారు తీసివేయదలచినారని మీర పొరపడనక్కరలేదు. తరువాత జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిళ్లను తీసివేసి వాటి స్థానే పెట్టబోవు ఎడ్యుకేషను బోర్డులలో ఆఫీసర్లకు ప్రాతినిధ్యమెక్కువయి, ఆఫీసర్లు కాని వారి ప్రాతినిధ్యము తక్కువగా నున్నగనుట గొప్ప పొరపాటు. జిల్లా కలెక్టరు, జిల్లా విద్యాశాఖాధికారి, జిల్లా ఇన్‌స్పెక్టరెస్సు తప్ప ఆఫీసర్లు ఎడ్యుకేషను బోర్డులలో నుండరు. మిగతా వారిలో కూడ ఉపాధ్యాయులకును, మేనేజర్లకును తగిన ప్రాతినిధ్యమీయబడుచున్నది".

"ఎడ్రెస్సులన్నియు చదివిన తరువాత మీ మ్యునిసిపల్ కౌన్సిలరు అయిన లక్ష్మీనరసమ్మ గారు ఆడపిల్లల హైస్కూలుయొక్క ఆవశ్యకతను గూర్చి మాట్లాడినారు. [illegible]విధముగనే మధురలోనూ, నెల్లూరులోనూ కూడ పురజనులు కోరియున్నారు. బాలికల విద్యపట్ల గవర్నమెంటువారునూ, మ్యునిసిపాలిటీలునూ కూడ నశ్రద్ధగా నున్న సంగతి నిజమే. మిషనువారు మాత్రము స్త్రీవిద్యకు మిక్కిలి తోడ్పడుచున్న మాట యనమొప్పుకొన వలసియున్నది. శంకరనాయరు సతిగారి స్కూలుకూడ స్త్రీ విద్యావిషయములో చాలా కృషి చేయుచున్నది కాని సరియైన ధనసహాయములేక అంతరించునట్లున్నది. ప్రతి పట్టణములోనూ బాలికల హైస్కూలు ఒకటి ఉండుటవసరమునినాకు తెలియును. పరిశ్రామిక విద్యావిధాన మమలులోనికి రాగానే, స్త్రీలకిచ్చు పరిశ్రామిక విద్య వేఱు కాబట్టి ప్రత్యేకపు స్కూలు ఉండుటవసరమగును. స్త్రీలు ఈవిషయమై వెనుదీయక గట్టి ఆందోళన చేయువలసియున్నది. అట్లు చేసిన గాని బాలికల విద్యకు తగిన స్థాన మీయబడదేమో యని నా అనుమానము".

"ఇక వార్ధాస్కీముగురించి చెప్పవలసియున్నది. చాలామంది ఈస్కీమునుగురించి పేపర్లలో చదివియుందురు. కాని ఎవ్వరునూ కూడ సరిగా అర్థముచేసికొని యుండరనియే నాయభిప్రాయము. ఆస్కీములోనున్న దంతయు ఇదివరకే పూర్తిగ వ్యక్తముకాని అభిప్రాయముల పూర్వకముగ మాలోచాలామందికి తెలిసియేయున్నది. కాని, గాంధిమహాత్మునంత వానికి మాత్రమే అట్టి క్లిష్ట సమస్యను అతిసులభముగ నందరకును వ్యక్తపరచి విద్యావేత్తలకు దారిచూపుట చెల్లినది. ఆస్కీముఅంతయు నాలుగు ముఖ్యసూత్రములమీద నాధారపడి యున్నది.

(1) మాతృభాషలో విద్యగఱపుట.— దీనికి అభ్యంతర మెవరికైననూ ఉన్నదా? ఆంగ్లభాషలోనేగాని దేనినీ నేర్చుకొనగూడదని లోలోన

అభ్యంతరములను చెప్పుకొనువా రుండకపోరు. వారుధైర్యముగ ముందుకువచ్చి అభ్యంతరములను చెప్పలేరు. వారికి మనమెంత గౌరవమీయవలసియుండునోమీరే ఊహించుకొందురుగాక.

(2) 7 సంవత్సరముల నిర్బంధోచిత విద్యగా ఎలిమెంటరీ విద్యను చేయుట:— ప్రస్తుతము ఎలిమెంటరీవిద్య 5 ఏండ్ల కోర్సుగానున్నది. దానిని ఏడేండ్లకోర్సుగా మార్చుటకు స్థిరపడినది. నిర్బంధముగా చేయుటలోని ఉద్దేశ్య మందరికివిదితమే. ఇక ఉచితముగా నిచ్చుటవద్దని ఎవ్వరునూ అనరు. గవర్నమెంటువారు ఆవిధముగా నివ్వగలిగిన మంచిదే. కాని సత్యమూర్తిగారు చెప్పినట్లు జమీందారు బిడ్డలకుకూడ ఉచితవిద్య ఎందులకు ? ఈయగలిగినవారివద్దనుంచి జీతములు తీసికొనిన గవర్నమెంటుకు కొంతసహాయముగా నుండునని నాయభిప్రాయము.

(3) చేతిపనులద్వారా విద్యగరపుట:-ఇదియే అందరిని కలవరపెట్టుచున్న విషయము. తల్లకిందులు పద్ధతిగానే కనుపించవచ్చునుగాని, అనుచరణీయము కాకపోదు. నాచేతిలోఉన్న పూలచెండువంటివి చేయుటే ఒక పరిశ్రమగా స్కూలులో జరుగుచున్నదనుకొందము. దీని చుట్టునూ గుచ్చిన ఆకులతో బోటనీ ప్రారంభింపవచ్చును. పూలరంగులను బట్టి రంగులసంగతి అంతయు పూర్తిగ చెప్పవచ్చును. ఎన్నిపూలు ఒక చెండగునో దానిమీద లెఖలు చెప్పవచ్చును. ఆపూలమొక్కలను పెంచుటకు తోటపని చేయించవచ్చును. ఈపూలను, కట్టిన చెండునూ డ్రాయింగు వేయించవచ్చును. అట్లే వడ్రంగమే చేతిపనిగాచేయు స్కూలునందు అడవులసంగతి, అవి ఉండుచోటుల మ్యాపులు గీయుట, ముక్కలు కోయుట, కొలతలు, వైశాల్యము, ఘనము వగైరాలనేకములు నేర్పుటకు వీలున్నది. పిల్లవానికి మనస్సునకు నచ్చునట్లునూ, వానికి ఉపయోగముగా నుండునట్లునూ చెప్పుటకు వీలున్న విద్య యిదియే కాని మరొకటి కానేరదు. ప్రస్తుతము స్కూళ్లలో నిచ్చువిద్యనేయిచ్చి, ఏవో గొప్పగొప్ప ఉద్యోగములను చేయగలమను దురభిప్రాయములను విద్యార్థులలో ప్రవేశపెట్టుటకు గవర్నమెంటు పూనుకొనజాలదు. గుమాస్తాలను తయారుచేయు విద్యనిచ్చుకాలము దాటిపోయినది. దేశమునకవసరమైన పౌరులను తయారుచేయు విద్యనిచ్చు రోజులు వచ్చినవి.

(4) చేతిపనుల మీద వచ్చు సొమ్ముతో స్కూలు నడుపబడుట:- ఈవిషయమై కూడ భేదాభిప్రాయము లున్నవి. దీనినిబట్టి గవర్నమెంటువారెంతమాత్రమును స్కూళ్లకొఱకై సొమ్మును ఖర్చుపెట్ట రనుకొన నక్కరలేదు. గాంధీగారే బిల్డింగు ఎక్విప్మెంటు ఖర్చు లిందులో నుండవని చెప్పియున్నారు. రికరింగు ఖర్చులకు చేతిపనులమీద వచ్చు ఆదాయమును వాడవలసి యున్నది. ఇది సాగనిది కాదు. చేతిపనులను చేయగానే తీసికొనకోఆపరేటివ్ మార్కెటు లాటివి స్థాపించిన యెడల తయారైన చేతిపనులు విడుదల చేయబడు చుండును."

"ఈ స్కీము నంతను సమగ్రముగ నాలోచించి సిలబస్సులను తయారు చేయుట ఒక కమిటీ ఎన్నుకొన బడినది. ఆ కమిటీ రిపోర్టు వచ్చిన తరువాత ఈస్కీమును గురించి యింకా ఎక్కువగా అందరికిని బోధ పడగలదు. ఈ మార్పులన్నియు ఎప్పటినుండి అమలు లోనికి రాగలవని మీరు అడుగవచ్చును. కొన్ని మార్పులు 1938-39 లోనే జరుగవచ్చును. 1939-40 లో అన్నిమార్పులునూ పూర్తిగ అమలులోనికి రావచ్చును."

ప్రొఫెసర్ వార్కేరుగారు తమ ఉపన్యాసమును ముగించిన పిదప సభికులలో నొకరు ఉపాధ్యాయుల [illegible]స్తులగూర్చి మాట్లాడవలసి

సదిగా కోరగా ఆయనయిట్లు చెప్పెను:-"గవర్నమెంటువారి సర్క్యులరు ప్రకారము గౌరవమైన రీతిని దుస్తులను ధరించవలెను. బుట్ట తలపాగాలును, కోట్లును ఉన్ననే గౌరవమైన దుస్తులగునని మీరు తలంపవద్దు. అన్ని విషయములలోనూ స్వేచ్ఛను కోరు యీ రోజులలో బుర్రకుకూడ కొంత స్వేచ్ఛనిచ్చి తలపాగాను తీసివేసిన బాగుండునని నాయభిప్రాయము. ఖర్చు తగ్గించుకొనవలసిన యీరోజులలో కోట్లు కుట్టించుటకు డబ్బుఖర్చు చేయుట కూడనిపని. మీస్కూలు మేనేజిమెంటువారు దీనికి వ్యతిరేకముగ మిమ్ములను ఒకేవిధమైన దుస్తులు వేయవలసినదిగా నిర్బంధించినప్పుడు వారి యిష్టప్రకారమే చేసి మాకుమట్టుకు ఆసంగతిని తెలియజేయ వలసినదని మిమ్మును కోరుచున్నాను."

అంతట బాపినీడుగారు లేచి తమ ముగింపు ఉపన్యాసము నిచ్చిరి. ఆంధ్రరాష్ట్రమును గూర్చిన ఆందోళన ఆంధ్రులు సరిగా చేయుటలేదనియు ఆంధ్రులకు నాయకుడే లేకపోవుట విచారకరమైన సంగతి అనియూ, ఆంధ్రులు కేవలము ఉత్సాహపూరితులేకాని, కార్యశూరులు కారని తెలుపుటకు అనేక నిదర్శనము లున్నవనియు చెప్పి సభను ముగించిరి.

ప॥ గో॥ జిల్లా ఉపాధ్యాయ సంఘమున కధ్యక్షులైన యమ్. శామ్యుయల్‌గారు లేచి తమకున్న అనుమానము లన్నియు తీరునట్లు ఉపన్యాసమిచ్చిన ప్రొఫెసరు వార్కేగారికిని, అధ్యక్షత వహించిన బాపినీడు గారికిని తమ కృతజ్ఞతాపూర్వక వందనములను దెలిపిరి. సభ 10. గం. 20 లకు ముగిసెను.




శ్రీయుత జలసూత్రం లక్ష్మీనారాయణగారు, టీచరు, బోర్డు హయ్యరు ఎలిమెంటరీస్కూలు,
పెదపాడు, ఏలూరు తాలూకా.

### క్రమశిక్షయనగానేమి ?

దీనియందు గొప్పయర్థ మిమిడియున్నది. ఇది సులభముగా వివరించుటకు వీలగునదికాదు. బడి బాలురకు శారీరక, నైతిక, మానసిక స్థితులను చక్కపరుచుచు క్రమాభివృద్ధిని గలిగించు కృషియే క్రమశిక్ష యనబడును. బాలురకు జీవనాధారమగు జ్ఞానాభివృద్ధిని గలిగించు విద్య బాగుగా వచ్చునట్లును వారికి సత్ప్రవర్తన ఏర్పడునట్లును, పాఠశాలయందు ఉపాధ్యాయుడు వినియోగించు సాధనములకెల్ల క్రమశిక్ష యని పేరు.

### క్రమశిక్ష పూర్వ మెట్లుండెడిది?

క్రమశిక్షాపద్ధతులు పూర్వము చాలా కఠినములై యుండెడివి. ఉపాధ్యాయులు బాలుర వయస్సు, ఆరోగ్యము, నైజగుణములు, మొదలగునవి లెక్కసేయక పిల్లలను భయపెట్టుట, కొట్టుట, తిట్టుట మొదలగు నపరాధముల నన్నింటినో చేయుచుండెడివారు. పిల్లలయెడల

అన్యాయముగను, నిర్దయగను, నిర్దాక్షిణ్యముగను, క్రూరముగను ప్రవర్తించెడివారు.

దుష్టశిక్షచేకలుగు నష్టములు.

అట్టిశిక్షను పొందినబాలురు తుంటరితనమునకును అల్లరికిని లోనగుదురు. వారి స్వేచ్ఛకును సహజాభిలాషలకును భంగము కలుగును. మనోదౌర్బల్యమును, మనోవ్యాధియు వృద్ధిపొంది బాలురు వికలచిత్తులగుదురు. ధైర్యసాహసములు అడుగంటిపోవును. వారి హృదయములు వికసించుటకు మారుగా సంకోచము చెందును. పిల్లలు బానిసలుగ తయారు కాబడుదురు. పిల్లలు బండబారుదురు. వారికి శిక్షయందలి భయము పోవును. అట్టిశిక్ష నిచ్చినమాత్రాన సరియైన విధేయతయు బాలురలో నలవడదు.

సరియైన క్రమ శిక్ష.

1. బడిలోని క్రమశిక్ష కొన్ని ఆజ్ఞలను బట్టియుండును. ఆజ్ఞలు విస్తారముగ నుండరాదు. మితిమీరిన ఆజ్ఞలు యివ్వరాదు. ఇచ్చిన ఆజ్ఞలను జరిపించవలెను. ఆజ్ఞలు ద్వంద్వార్థములు లేక స్పష్టముగ గ్రహింపగలిగినవై యుండుట మంచిది. ఇచ్చిన ఆజ్ఞలను మార్చరాదు. వాటిని మరువకుండ ఎప్పటికప్పుడు జ్ఞాపకము చేసికొనుటవసరము. వట్టి బెదరింపులతో ప్రయోజనము లేదు. జరిగింప నుద్దేశ్యములేని ఆజ్ఞలను యిచ్చుట కూడదు.

2. బాలురను భయపెట్టుట, మాటిమాటికి దెబ్బలు కొట్టుటయే క్రమశిక్ష యని కొందరభిప్రాయపడుచున్నారు. కాని అది చాలా పొరబాటు. బాలురకు దురాలోచనలు, దురభ్యాసములు అలవడకుండ చేయుటకు సుశిక్ష అవసరము. అది కేవలము దండోపాయముచేతకాదు. కాలము మారినకొలది శిక్షలుకూడా మారిపోక తప్పదు. ఇప్పుడు ఉపాధ్యాయుడు అవివేకముగా దండింప నుద్యుక్తుడుకాకూడదు. కాఠిన్యము వహింపనేకూడదు. విద్యార్థులయందు ప్రియముగానుండి వారిచే గౌరవింపబడ గలిగియుండవలెను. పిల్లలను ప్రేమతో చూడవలెనుగాని కొట్టి చదివించకూడదను నియమముఏర్పడవలెను. సామాన్యముగా బడులలో నిచ్చు శిక్షలకు యీక్రింద నుదహరించినవి కారణములై యుండవచ్చును.

(1) ఆజ్ఞలను పిల్లలు ఉల్లంఘించిరనెడు అహంభావత్వముచేతను,

(2) కోపస్వభావము చేతను,

(3) ఆయా విద్యార్థులపై కసిదీర్చుకొను స్వభావముచేతను,

(4) చక్కని పద్ధతులతో నుపకరణముల గూర్చి బోధించలేకను,

(5) సిలబసు, టైముటేబిల్సు, పరీక్షలు, చీమలు జెఱ్ఱులమీద పాకినట్లుండి ఏమియుదోచక నిరుత్సాహతచెంది యుండుట వల్లను,

(6) రెండుమూడు తరగతుల బాలురనొక్కే యుపాధ్యాయుడొక్కే కాలమున నిర్వహించుట వల్లగలుగు విసుగుకలచేతను,

(7) చీకాకు, కోపముగానున్నప్పుడును,

(8) వారిని లొంగదీయవలెనను నుద్దేశ్యముతోను,

(9) "చెప్పినపని చేసితీరవలెను, ఎదురుప్రశ్న చెప్పరాదు, ఎదురు పలుకరాదు" అనే అహంభావత్వముచేతను,

(10) పిల్లలసహజచతురతను గ్రహింపలేకను,

(11) పిల్లవానిగురించి "ఏల శ్రద్ధగాలేదు? ఆహారము చాలదా? యింటివద్ద అలవాటులా? లేక బోధనాలోపమా?" అనునట్టి పరిశీలన లేక పోవుటచేతను,

(12) వారి సహజ పరిశీలనాశక్తులకు అనుకూలముగా తోడ్పడలేకపోవుట చేతను,

(13) చేతికి లొంగినవారుకదా యనియు,

(14) వారి మనోభావములను ఎరుంగకవారు చేసిన పనులు తప్పులని భ్రిమపడియును,

(15) తగినంతపని నీయక పిల్లలను నిర్వ్యాపారులుగ వదలుటచేత కలిగిన అల్లరిని మాన్పుటకును,

(16) వారి అభిరుచికి భిన్నమగు పనులను చేయించుటచేకలుగు నిర్లక్ష్యమును, నిరుత్సాహమును పోగొట్టుటకును, పైశిక్షలవలన ఉపాధ్యాయులు పరశోలస్థితిని చక్కబరచలేరు. విద్యార్థులయందు అజాగ్రత్త అసంతృప్తి గలుగక మానవు. కాని అటువంటి శిక్షలు శుశిక్షలు కానేరవు. సాధారణముగా శిక్షలు సృష్టికి వదలిన పెక్కులాభములు గలవు. (The punishment should be natural) మనముచేయు శిక్షలలో చాలా లోటుపాటులుండకమానవు. అవి మన చిత్తవృత్తి ననుసరించి, సంగతిసందర్భముల ననుసరించి యుండును. సృష్టిచేయు శిక్షలు నిష్పక్షపాతముగనుండును. అన్యోన్యమైత్రి చెడదు. ద్వేషము పోసగదు. నిజము వెంటనే బయలు పడును. వారుచేయు తప్పిదములకు రానున్న శిక్షలు గుర్తెరుంగునట్లు చేయును. (The discipline of consequences) పిల్లవాడు. దీపముపై వ్రేలుంచిన కాలిపుండుపడును. ఒక జగడమాడు పిల్లవాడు తనతోడి బాలురచే ఆటలాడు కొనుటకు రానీయకుండా దూరముగా వెడలగొట్టబడును. ఆలోచనలేకుండా ప్రవర్తించు పిల్లవాడు వెంటనే హానిపొందును. ఇటువంటి సృష్టి చేయు శిక్షలలో ఎటువంటి పక్షపాతముగాని, లోటుగాని కనుపించదు.

3. క్రమశిక్ష బహుమతులపై కూడ కొంతవరకు ఆధారపడియున్నది. పిల్లలయందు తమ విధ్యుక్త ధర్మమును (sense of duty) తాము తెలిసికొను శక్తి చాలా తక్కువగా నుండును. తమ పనినిగురించియు, తమశక్తిని గురించియు తమలో విశ్వాసమును పెంపొందింప జేయుటకు బాలురకు బహుమతు లిచ్చుట కొంతవరకు అవసరము. పిల్లవాడు పెద్దలవద్దనుండి ఆజ్ఞలను పొందకయే తాను నెరవేర్చవలసిన పనిని తాను సక్రమముగ నెరవేర్చుటయే తనయొక్క విధి యని తెలిసికొనునట్లు చేయవలెను. ఉపాధ్యాయుడు కొట్టుననిగాని తిట్టుననిగాని పరాభవించుననిగాని, యేర్పడిన భయమువల్లనూ, లేదా, తనను పొగడుననిగాని, బహుమతు లిచ్చుననిగాని, మార్కులు వచ్చుననిగాని, కొన్ని హక్కులు సంపాదించవచ్చుననిగాని, మర్యాద, గౌరవము హెచ్చుననిగాని, యేర్పడిన ఆశ వల్లనూ బాలురు లొంగియుండుటకు ప్రయత్నించక, కేవలము పెద్దవారు చెప్పినట్లు చేయుటయే తమ విధియని తెలిసికొనుటకు బాలురకు చాలినంత యవకాశము కలిగింపవలెను.

4. ఉపాధ్యాయుడు తన వర్తనమునందు ఆదర్శప్రాయుడుగా మెలంగిన విద్యార్థులు కూడ నట్లే మెలంగుదురు. శిష్యవాత్సల్యము, సాధుశీలము, బోధనా కౌశలము గలిగి యుండవలెను. బాలురు తన్ను ప్రేమించునట్లు ఉపాధ్యాయుడు యత్నించవలెను. ఉపాధ్యాయుడు విద్యార్థుల మనోతత్వము ముందుగా చక్కగా గ్రహించి వారికి తగినట్లు విద్య గఱపవలెను.

(1) వారికి ఉచితానుచిత విచక్షణను కలుగ జేయ గలుగు అంతరాత్మను (conscience) (2) వారు మంచిచెడ్డలు గ్రహించిన పిమ్మట యిది మంచిపని గనుక చేయవచ్చును, యిది చెడ్డపని గనుక చేయకూడదు అను దృఢనిశ్చయము మనస్సునందు కలుగచేసకొనుటను (conviction) (3) తనకు ఏపని చేయుట మంచిది యని తోచునో ఆపనిని చేయుటకు మనోధైర్యములు

గలిగియుండుటను (courage) ఉపాధ్యాయులు తమ బాలురలో నలవడ జేయవలెను.

5. క్రమశిక్ష ప్రకృతి పరిస్థితుల మీద కూడ నాధారపడియుండును. విద్యార్థుల పరిసర ప్రదేశములు అధమము విద్య నేర్చుకొనుచున్న కాలములో నైనను చక్కనివై యుండవలెను (Good physical surroundings).

పాఠశాలలు చీకటిగాను, వస్తుసముదాయముతో నిండినవిగాను ఉండరాదు. క్రీడాస్థలములు బాగుగానుండవలెను. బడిగృహములు, తగినంత వెలుతురు, గాలి, ఉదుపట్లును, ఆరోగ్యకరముగను అందముగను యుండవలెను. చుట్టుపట్ల కూడ ఫ్యాక్టరీలు గాని, రైలు స్టేషనులు, మిల్లులు, నాటక శాలలు మొదలగు ధ్వని గలిగించునట్టివి యుండరాదు.

విద్య మనస్సుతో సంబంధించినది గావున పరిస్థితులు విద్యా బోధనకు ఆటంకములుగ నుండరాదు. పరిస్థితులు అన్నియు అనుకూలముగ నుండిన బాలురు బోధనాంశములు శ్రద్ధగా గ్రహింతురు. ఉపాధ్యాయుని యెడ గౌరవముంచుదురు.

6. ఉపాధ్యాయు లొకరితో నొకరు అనుకూల్యతను జూపుచుండుట వలన కూడ పాఠశాలలోని క్రమశిక్ష అభివద్ధిచెందగలదు. ఉపాధ్యాయు లందరు పాఠశాల అభివృద్ధియే మనస్సునం దుంచుకొని పాటుబడుట శ్రేయస్కరము. ప్రధానోపాధ్యాయుడు జారీచేయు ఆజ్ఞలు నిబంధనలు మొదలగునవి అంత అనకూలముగ లేవని తోచినప్పటికిని అవి బాగుండలేదని కాని, వానియందు దోషములు కలవని కాని, వితండ వాదనలు, అడ్డంకులు, మొదలగునవి చేయక వాటి ప్రకారము నడుచుకొనుట వలన పాఠశాలాభివృద్ధికి తోడ్పడిన వారగుదురు. ప్రధానోపాధ్యాయులును తనతోటి ఉపాధ్యాయు లిచ్చు సలహాలను, వారి యిబ్బందులను కూడ కొంతవరకు ఆమోదించుట మంచిది.

7. కాగితపు కట్టుబాటులు కూడ కొంతవరకు బడిలోని క్రమశిక్షకు ఆధారభూతములై యున్నవి. రిజిష్టర్లు, రికార్డులు మొదలగు కట్టుబాట్లు స్కూలుయొక్క స్థితిగతులు చక్కగా తేటపర్చును.




ఆర్యులారా !

బాల బాలికల హృదయములు భక్తి పూరితములును, విశ్వాస భరితములును, కరుణారస వంతములును, కార్యాచరణాసక్తి యుతములును, ఉత్సాహ జనకములు నై యుండు టెల్లరకును విదితమే.

మహత్తరమైన సద్విషయము లెల్ల సంస్కృత గ్రంథములం దమరియున్నవి. సంస్కృత పాఠశాల లత్యల్ప సంఖ్యాకములై యున్నవి. సంస్కృత భాషాజ్ఞానముగల స్త్రీ పురుషులు కొలదిమందియే గలరు. వారలకు ప్రత్యేక పాఠశాల లతిమితసంఖ్య గలవియై యున్నవి.

బాల బాలికల విద్యాభ్యసన దశమ కాలిక ముగ నుండును. పిన్న వయస్సున హృదయము లందు నాటఁబడిన బోధనా బీజములు తెన్నుగ నభివృద్ధిఁ జెందును. అట్టి యోగ్యమగు సమయమున పిల్లలకు లౌకికవిద్యను మాత్రమే నేర్పింప జూచువార లధిక సంఖ్యాకులై యుండుట శోచనీయముగ నున్నది. మోక్ష మార్గము నుద్బోధించు బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు, భగవద్గీత, యనెడి ప్రస్థానత్రయమం దొకటియగు "భగవద్గీత" క్రైస్తవ పాఠశాలలందు బైబిలువలె, హిందూ పాఠశాలలందెల్ల వాచక పుస్తకముగ నియమింపఁబడి, వాడుకఁ జేయఁబడుట లేదు.

మోక్షజ్ఞానముగల స్త్రీపురుషులెల్లను పాపభీతి, పుణ్యచింత, పతిభక్తి, దైవభక్తి, సతీ పతీ ధర్మములు, కర్మతత్వము, జన్మాంతర సిద్ధాంతము, జ్ఞానమార్గము, వైరాగ్య ధర్మములు, మోక్ష విచారము మున్నగు మహత్తర విషయముల నభ్యసించి, తమ సంసారములను రాజయోగ క్రమమున భూతల స్వర్గములుగ గావించుకొని, పరమ పావన హృదయులగు భావి పౌరుల జననమునకు కారకు లగుదురు.

అట్టి మోక్షజ్ఞానము నుపదేశించు "భగవద్గీత" గ్రామ పునర్నిర్మాణమునకు పునాదులగు పాఠశాల లందు వాడుకలో నియమింపఁబడి యుండిననే గాని దేశసేవకు పూర్ణత్వము సిద్ధింపనేఱదు.

భగవద్గీతా ధర్మము లన్నియు నెల్లఱచే ప్రమాణములుగ నాదరింపఁ బడుచునే యున్నవి. ఆ గ్రంథ విషయములు పామరుల కప్పు డప్పుడు కాలక్షేపార్హములుగను, శ్రోత్రియులకుఁ బారాయణ యోగ్యముగను, పండితులకు ప్రమాణ వచనములుగను వన్నెకెక్కి విలసిల్లుచునే యున్నవి. మరియు నవ్విషయములు విద్వజ్జన సభలయం దుపన్యసింప బడుచున్నవి. పత్రికల యందు వ్యాస రూపకముగ ప్రకటితములగుచున్నవి. త్రివిధభాష్యములును, పలు వ్యాఖ్యానములును, అనేక టీకా తాత్పర్య సంగ్రహములు, పెక్కుమందిచే రహస్యార్థ గూఢార్థ దీపికలును రచింపఁబడు చున్నవి.

కాని యవి మూలగ్రంథములోని యంశములకు విరుద్ధభావముతో నుండిరనియు, లోపము కల్పనను గలిగియుండినవను కొందఱభిప్రాయములు వినవచ్చు చున్నవి.

కొందరు ప్రాథమికోపాధ్యాయులు గీతా విషయములను తమకే సుబోధకములు గావని యధైర్యపడుచు, పిల్లలకు బోధింప శక్యముగాదను నిరుత్సాహమును సూచించుట తెలియుచున్నది.

మన యాంధ్రభాషలో సులభశైలి నింతవఱకు నంగీకరింపబడి యున్నరీతి వాచకపుస్తకములయందలి పాఠములవలె భగవద్గీతయందలి విషయములను విభాగముఁజేసి, సుబోధకముగ నమర్చి, పండితులచే దోషములులేకుండ సరిజూపించి, తరగతివారిగా "గీతావాచకములు" అను పేర మాసమాజమునుంచి పాఠకలోకమునకు గ్రంథముల నందజేయ నుద్యమించి యీ విషయమును ప్రచారము చేయుచున్నాము.

ఈ ప్రచార కార్యక్రమమును ప్రతి పురజనులును, పత్రికాధిపతులున్నూ, ప్రజాసంస్థల యధ్యక్షులును, విద్యాశాఖాధికారులును, పండితులును, ప్రధానోపాధ్యాయులును ఆదరించి పోషించిన యెడల మా సమాజాశయము సార్థక్యము జెందును

ఇట్లు సకలజనశ్రేయోభిలాషి,
తల్లాప్రగడ వీరేశలింగంశర్మ,
ప్రెసిడెంటు, శ్రీ భగవద్గీతా ధర్మప్రచారక సమాజం, ఇంజరం, కొకినాడ తాలూకా,
తూర్పుగోదావరిజిల్లా.

# సభలు.

## టీచరు మేనేజర్ల సభ.

తాడేపల్లిగూడెం రేంజి, నాన్ మిషన్, ఎయిడెడ్ పాఠశాలలు, టీచరు మేనేజర్ల పంచమ వార్షికోత్సవ మహాసభ ది 31-10-1937, సం॥రం॥ తేదీ ఆదివారం 2 గం॥ లగాయతు, తాడేపల్లి గూడెం బోర్డు హయ్యరు యెలిమెంటరీ పాఠశాల భవనములో- తాడేపల్లిగూడెం రేంజి స్కూళ్ళ డిప్యూటీ ఇనస్పెక్టరుగారగు మ॥ రా॥ శ్రీ T. నరశింగరావు పంతులు B A. L T వారి అధ్యక్షతను, జరుపబడి యీదిగువ తీర్మానములుఆమోదింపబడినవి.

1. మన సార్వభౌములైన శ్రీ ఆరవజార్జి చక్రవర్తిగారికిని, వారి సతీమణికిని, వారికుటుంబమునకును, ఆయురారోగ్య, ఐశ్వర్యముల నొసంగుటకు ఈసభవారు, శ్రీభగవంతుని గూర్చి ప్రార్థించుచున్నారు.

2. హైస్కూల్సు లేక మిడిల్‌స్కూల్సు యున్న గ్రామములలోగాని అట్టి ప్రదేశములకు 2 మైళ్ళదూరములోనున్న ప్రదేశములలోగాని పనిచేయుచున్న ఎయిడెడ్ పాఠశాలలో, పోర్టు సెంటుజార్జి గెజటు G O No 174/D/26-1-37 రులో Assessment of grants కుసంబంధించిన 6 వ అయిటము రూలు ననుసరించి, IV & V తరగతులు ఉన్నను లేకపోయినను, ఒకవేళ ఉన్నచో, I వ తరగతిలోని, విద్యార్థుల సంఖ్యలో $\frac{1}{4}$ వంతు సంఖ్య IV & V తరగతులలో యుండవలెను, అనునిబంధనను పూర్తిగా వెంటనే తొలగించగలందులకు సవరణ చేసి ఉత్తరువులు జారీచేయించగలందులకు శ్రీగవర్నమెంటు వారిని యీసభవారు కోరుచున్నారు.

3. ఎయిడెడ్ పాఠశాలోపాధ్యాయులు, సమస్తవిషయములలోను, బోర్డు మొదలగు యితర సంస్థలలోని, ఉపాధ్యాయులతో, సమాన అర్హతలుకలిగి శ్రద్ధగా పనిచేయుచున్నను, వీరికివ్వబడుచున్న గ్రాంటులు బహు స్వల్పముగా నున్నందున, జీవనోపాధికి కష్టమగుచున్నది. గాన బోర్డుఉపాధ్యాయుల జీతములతో సమానముగా నుండులాగున, మా గ్రాంటు స్కేలుహెచ్చించి, సదరు గ్రాంటు ప్రతినెలకు మాకుయిచ్చునట్లు యేర్పాటులు చేయించి వెంటనే అమలులో పెట్టగలందులకు శ్రీగవర్నమెంటువారిని యీసభవారు కోరుచున్నారు.

4 ఎయిడెడ్ పాఠశాలలో, చేతిపనులు అనగా రాటముపై నూలుతీయుట, వడ్రము, నవారు నేత, మొదలగుపనులు నెలకొల్పి, పని చేయువారికి, స్పెషలు గ్రాంటు యిప్పించ గలందులకు, శ్రీగవర్నమెంటు వారిని యీసభ వారు కోరుచున్నారు.

5. ఎయిడెడ్ పాఠశాలోపాధ్యాయులకు, వారి స్కూలులోని, విద్యాభివృద్ధి, బోధనాపద్ధతులు, చక్కగ యున్నను, బిల్డింగు, ఫర్నిచరు, గార్డెను (తోట) లేవు అని, టీచింగు గ్రాంటులలో, పరీక్షాధికారులు తగ్గింపు సిఫార్సు చేయుచున్నారు. అది కేవలము అన్యాయము గాన

అట్టి స్కూళ్లకు, టీచింగు గ్రాంటులలో తగ్గించకుండ, పూర్తి గ్రాంట్లు సిఫార్సుచేసి, యిప్పించగలందులకు శ్రీ పరీక్షాధికారులను యీ సభవారు కోరుచున్నారు.

6. ఫోర్టుసెంటుజార్జి గెజటు G O No 174/26-1-37 గల గ్రాంటు స్కూళ్లకు సంబంధించిన, నిబంధనలు కేవలము, గ్రాంటుస్కూళ్లను నిర్మూలించుటకే ఉపయోగింపబడును గాని, దేశములోని అవిద్యను, రూపుమాపుట కెంత మాత్రము తోడ్పడవు. శ్రీ గవర్నమెంటువారు ఉచిత నిర్బంధ విద్యావిధానము, అమలులో పెట్టిన పిమ్మట గాని, యీ నిబంధనలు అమలులో నుంచరాదు. అంతవరకు యీ నిబంధనను అమలులోనుంచి తగ్గించగలందులకు, శ్రీ గవర్నమెంటు వారిని ఈసభవారు కోరుచున్నారు.

7. ఎయిడెడ్ పాఠశాలల కిచ్చు అర్ధసం॥రపు గ్రాంటు విషయములో ప్రతి స్కూలును 6 మాసములు పనిచేసిన పిమ్మట, అర్ధసం॥ర॥పు గ్రాంటుకు దరఖాస్తు పెట్టుచున్నారు. అట్టిమెడ ప్రస్తుతము అమలులోనున్న, Efficient-schools కే యివ్వబడును అను నిబంధనను, తొలగించి ప్రతి స్కూలుకు అర్ధసం॥ ర॥ పు గ్రాంటు యిప్పించగలందులకు శ్రీ గవర్నమెంటువారిని యీ సభవారు కోరుచున్నారు.

8. పూర్వముకన్న, యిప్పుడు పరీక్షాధికారుల సంఖ్య చాలవరకు హెచ్చుచేసినారు. ఇంతమంది పరీక్షాధికారులు కేవలము అవసరము గాన వీరిలో కొంతమందిని తగ్గించి, వారి జీతములక్రింద ఖర్చుపెట్టు డబ్బును, మా ఎయిడెడ్ పాఠశాలల అభివృద్ధికిని, ఎలిమెంటరీ విద్యాభివృద్ధికిని, ఖర్చుపెట్టిన బాగుగ నుండును. గాన అట్లు చేయించగలందులకు శ్రీ గవర్నమెంటు వారిని యీ సభవారు కోరుచున్నారు.

9 తల్లి దండ్రులు తమ పిల్లలను, మా పాఠశాలలో ప్రవేశపెట్టి 5 వ తరగతి ప్యాసుకాకుండగనే, హైస్కూల్సు లేక మిడిల్ స్కూల్సుకు ఇంగ్లీషు చదువు నిమిత్తం, 3 వ తరగతి ప్యాసైన వెంటనే, తీసికొని పోవుచుండుటచే, మా స్కూళ్లలో IV V క్లాసులలో సరిఅయిన సంఖ్య లేకుండ నుండుచున్నది. గాన తల్లి దండ్రులు తమ బాలురను 5 వ తరగతి ప్యాసై సర్టిఫికెట్టు పొందనిదే ఆయా స్కూళ్ళలో నుండి దీసికొని పోగూడదు. అట్లుచేసిన వారిపై తగుచర్య తీసికొనుటకు, ఉత్తరవులు జారీ చేయించ వలసినదిగా శ్రీగవర్నమెంటు వారిని యీసభవారు కోరుచున్నారు.

(10) మనదేశము చిన్న పల్లెలతో నిండియున్నది. అట్టి పల్లెలలో విశేషజనాభా యుండదు. అందుచే ఒకే టీచరుకు సరిపడిన విద్యార్థులే అక్కడనుండి స్కూలుకు రావచ్చును. అందుచే ఒకే టీచరుకన్న యెక్కువమంది ఉపాధ్యాయులకు పనియుండదు. గాన సింగిలు టీచరు స్కూళ్లను, నిర్మూలించక, వాటికి గూడ గ్రాంటులను ఇంక్రిమెంటులోసహాయిచ్చి, పూర్తి ప్రోత్సాహము యివ్వగలందులకు ఏర్పాట్లు చేయవలసినదిగా శ్రీగవర్నమెంటు వారిని ఈ సభవారు కోరుచున్నారు.

(11) షుమారు 10 సం॥ ర॥ ములకు తక్కువ గాని సర్వీసుగల, ఏగ్రేడు ఉపాధ్యాయునికైనను, మరియు S S L. C. పరీక్షకు తక్కువ కాని గవర్నమెంటు లేక యూనివర్సిటి పరీక్షలు ప్యాసైన, ఉపాధ్యాయులకు ఫోర్టుసెంటు జార్జిగెజటు G O. NO. 174/26-1-37 తేదీనాటి రూల్సు అమలులోనికి రాకపూర్వమే ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాలలో పనిచేయు టీచర్లకు, ట్రయినింగుతో నిమిత్తం లేకుండా, సింగిల్ టీచరుగా పనిచేయుచున్నను, వారి వారి

గ్రేడుల ననసరించి, ఎల్లప్పుడు వెనుకటి వలెనే ది 1-1-1939 సం॥ రం॥ తేదీ లగాయతు గ్రాంట్సు యిప్పించ గలందులకు, శ్రీగవర్నమెంటు వారిని యీసభవారు కోరుచున్నారు.

ఈ దిగువ వారిని యీ రేంజి సంఘ కార్యనిర్వాహక సభ్యులుగను, మరియు వీరినే, యీ రేంజి సంఘము తరఫున జిల్లాసంఘమునకు ప్రతినిధులగను ది 31-10-1937 తేదీలగాయతు ఒక సంవత్సర కాలము ఉండగలందులకు ఎన్నుకొని ఏకగ్రీవముగ తీర్మానించడమైనది.

1. కూచి సోమేశ్వరరావుగారు.
2. కవుల సుబ్రహ్మణ్యంగారు.
3. శిరిగిసీడి వెంకట నారాయణగారు.
4. తుమ్మోద సుబ్బరాజుగారు.
5. దోనేపూడి సుబ్బారావుగారు.
6. మెల్లన నరశింహంగారు.
7. పంతం బాపిరాజుగారు.
8. మహాశివభట్టు వెంకటచలపతిరాజుగారు.
9. యీమని గంగాధర శాస్త్రిగారు.
10. Mr. Alatı Judah.
10. తల్లాప్రగడ సుబ్బారావుగారు.

ఇట్లు,

దరిశపర్రు, 11-11-1937. } దోనేపూడి సుబ్బారావు, సెక్రటరీ.

---

# సేవాసమితి బాలవీర వారము.

తే 15-11-1937 దీ నుండి 21-11-1937 వరకు.

బోర్డు హయ్యర్ ఎలిమెంటరీ పాఠశాల, జలుమూరు.

సేవాసమితి బాలవీర సంఘమునకు చెందిన అజిత్ ట్రూపుచే ఈ పాఠశాల ఆవరణయందు స్కౌటువారము తే 15-11-1937 దీ నుండి తే 21-11-1937 దీ వరకు మిక్కిలి జయప్రదముగా జరుపబడినది. ఈ యుద్యమము ఇచ్చట స్థాపింపబడి సంవత్సరము మాత్రమే యగుటచే దీనిని ప్రథమ వార్షికోత్సవమని చెప్పనగును. శ్రీకాకుళం జిల్లాబోర్డువారి ద్వారా నేషనల్ హెడ్‌క్వార్టర్సు అలహాబాదు నుండి వచ్చిన కార్యక్రమమే అనుకరింపబడినది.

శ్రీకాకుళం రేంజీ స్కూళ్ళ జ్యూనియర్ డిప్యూటీ ఇనస్పెక్టరుగారగు మహారాజ శ్రీ యమ్. గోపాలస్వామినాయుడు బి.ఎ. బి యి.డి. గారి అధ్యక్షతక్రింద తే 15-11-1937 దీని స్కౌటు వారప్రదర్శనములు ప్రారంభింపబడెను. ఆప్రథమ సమావేశమునకు ఆగ్రామము నుండియే కాక పరిసర గ్రామములనుండి కూడ ఉపాధ్యాయులును, పురజనులును, బాల బాలికలును, సమావేశమైరి. స్కౌటు ఉద్యమ నిర్మాణమును గూర్చియు, దాని అవసరమునుగూర్చియు, పురజన ప్రముఖులును ఉపాధ్యాయులును విపులముగా నుపన్యసించిరి. స్కౌటు ఉద్యమము యొక్క ముఖ్యోద్దేశములును స్కౌటువారము యొక్క ఆవశ్యకతను దెలుపుచు ఈ చుట్టుపట్ల మిక్కిలి వ్యాప్తినందియున్న ఆరోగ్యవారము మొదలగు వానితో దీనిని పోల్చుచు అధ్యక్షుడు

విఫులముగా ప్రారంభోపన్యాసమును గావించెను. ఆంతోపన్యాసమున నాతడు స్కౌటు ఉద్యమము యొక్క చరిత్ర తెలియజేయుచు నిది తొలుత సర్ రాబర్టు బేడన్ పవెల్ అను మహామహునివలన 1907లో స్థాపింపబడి ఎట్లు ప్రపంచ వ్యాప్తి నందినదో చెప్పుచు ఆ యుద్యమమును సేవాసమితి యెట్లు జాతీయము జేసెనో నుడివిరి.

మరుసటిదినమందున్, మిగిలిన దినములందును స్కౌటువీరులు తమబాలవీరనాయకుని యొక్కయు కిశోర వీరనాయకునియొక్కయు సూచనలననుసరించి "బాలవీరులు, తనగృహము" "బాలవీరుడు, తనపాఠశాల"లను విషయముల పై మిక్కిలి శ్రద్ధవహించిరి. బాలవీరులకును కిశోర వీరులకును తమనాయకులు తమగృహములను గృహపరిసరములను గృహోపకరణములను ఎట్లు పరిశుభ్రముగా నుంచవలయునో బోధించిరి. వారు పరిశుభ్రముగా నుండుటవలనను, వారి వారి గృహములు పరిశుభ్రములుగా నుండుట వలనను, ఎట్లు ఇరుగుపొరుగువారు, మార్పు నందగలరో, క్రమముగా నెట్లు గ్రామమంతటిని బాలవీరులు బాగుచేయగల సమర్థులు కాగలరో వారికి బోధింపబడెను. బాలవీరులు తాము నేర్చినది ఆచరణలో పెట్టిరో లేదో పరీక్షింపబడి తమనాయకుల సంతృప్తికి పాత్రులు కాగలిగిరి. స్కూలుఅధికారుల యనుజ్ఞనుపొంది బాలవీరులు స్కూలునకు గావించిన సేవ అమూల్యము వారుకొన్ని చరిత్రసంబంధమైనట్టి దేశ పటములను తయారుచేసి తే 17-11-1937 దీని గ్రామమునందు మెడికల్ ఆఫీసరుగాయున్న మహారాజశ్రీ పి. వేంకటేశ్వరరావు నాయుడు ఎల్ ఐ. యమ్‌గారి అధ్యక్షతక్రింద జరుపబడిన మీటింగులో స్కూలునకు బహుమానము నొసంగి బోధనా సౌకర్యముల పెంపొందింపజేసిరి. తే 18-11-1937 దీని నిర్ణయింపబడిన కార్యక్రమము "సేవ" యను సంచికను గ్రామస్థులకమ్మి దానిని విశేషవ్యాప్తి నందునట్లు చేయుట వ్యవధి చాలకుండుటచే అలహాబాదునుండి సంచికలు రానందున కాగితములపై వ్రాసి ఆకరపత్రములను బాలవీరులు గ్రామమున పంచిపెట్టిరి. ఇందువలన ప్రజలు, ఉపాధ్యాయులు, బాల భటోద్యమము యొక్క యావశ్యకతను గురించి యుత్సాహపూరితులైరి.

తే 19-11 1937 దీని మహారాజశ్రీ డి. ఎ. జగన్నాథరావు హెడ్‌మాష్టరు గారిఅధ్యక్షత క్రిందసభ జరుపబడెను రాణాప్రతాపసింహుడు, శివాజీ, చాంద్‌బీబీ, రాణీదుర్గావతి, మీరాబాయి, మొదలగు దేశభక్తుల పటములు చూపబడెను. పురజనులును ఉపాధ్యాయులును పైని వ్రాసిన దేశభక్తుల జీవితములను వారి ఆదర్శములను వారి పట్టుదలను, వారి దేశభక్తిని తెలియజేయుచు యుపన్యాసముల నొసంగిరి. పుష్పమాలాలంకృతులైన వారి పటములు జాతీయగీతములతో బాలవీరులచే నూరేగింపబడెను.

మఱునాడు బాలవీరులచే తయారు చేయబడిన వస్తువులు అంత్యదినమున చూపబడుటకై పాఠశాలయందు క్రమముగా పేర్చబడెను. ప్రతిదిన కార్యక్రమమున నొక భాగమగు స్కౌటు ప్రదర్శనములు, నేమను కావింపబడెను. అవి అతి ఉత్సాహవంతములు, ఆరోగ్యాభివృద్ధికరములు, దేశభక్తిప్రోత్సాహకారులు, మనోమోహనమంత్రములునై యుండెను.

అంత్యదిన సమావేశమునకు దయతో నధ్యక్షతను మహారాజశ్రీ పి. వేంకటేశ్వర నాయుడు గారు మరల వహించిరి. స్కౌటు బజారునందుగల వస్తువుల శ్రీవారే ముందు కొన్నిటిని కొనగానే అనేకులు బాలురచే తయారుకాబడిన

యీ వస్తువులను కొనసాగిరి. ఇది చక్కగను ఉపయోగకరములుగను నుండి ప్రేక్షకుల మనస్సుల నాకర్షించెను. బాలవీరులయొక్క జండా గానము వీరరసప్రధానము. వారు గావించు సింహనాదములు నిజముగా సింహనాదములవలె నుండి వేడిరక్తము నుబికింపజేయును. వారి జాతీయగీతములు పరోపకార దీక్షాదక్షానుకూలములు. వారు చేయు ప్రతిపనియు నుపయోగకరమగునదిగనే యుండి ప్రేక్షకులని మనముల నాకర్షించెను. అంత్యమున "వందేమాతరం" పాటపాడబడి బాలవీరవార ప్రదర్శనములు ముగింపబడెను.

డబీరు జగన్నాధరావు.
సెక్రిటరీ, టీచర్సు ఎసోసియేషను, ఉలుమూరు

---

# వింతలు-విశేషములు.

### ప్రపంచములోని పెద్దనగరముల జనాభా.

| | | |
|---|---|---|
| లండను (ఇంగ్లండులోనిది) | | 82 లక్షలు. |
| న్యూయార్కు (అమెరికాలోనిది) | | 70 లక్షలు. |
| టోకియో (జపాన్‌లోనిది) | ... | 53 లక్షలు. |
| బెర్లిన్ (జర్మనీలోనిది) | . | 40 లక్షలు. |
| పారిస్ (ఫ్రాన్సులోనిది) | ... | 29 లక్షలు. |
| కలకత్తా (ఇండియా) | . | 15 లక్షలు. |
| బొంబాయి (ఇండియా) | ... | 11 లక్షలు. |
| మద్రాసు (ఇండియా) | | 6½ లక్షలు. |

లండను ప్రపంచములోని అన్నినగరములలో మిక్కిలి పెద్దది. దానియొక్క విస్తీర్ణము దాదాపు 116 చ॥ మై॥ మొత్తము 28 మ్యునిసిపాలిటీల పరిపాలనలో నున్నది. ఇంగ్లండు దేశమంతటిలోని జనాభాలో నాల్గవవంతు కేవలము ఒక్క లండను నగరమందే యున్నారు. ఆస్ట్రేలియా ఖండమంతటిలోని జనాభా 66 లక్షలే అయియుండగా ఒక్క లండను పట్టణములోనే అంతకంటె యెక్కువ జనాభాయుండుట చాలా శోచనీయము. ఆనగరములో కొన్నికొన్ని చోట్ల భూమియొక్క విలువ చతురపు అడుగు 1కి 75 పౌ. అనగా రు 1500 లు.

* * * *

### లండనుమీద విమానములనుండి బాంబులు.

విమానముల మీదనుండి పేల్చిన బాంబులకును, వాటినుండి వదలిన విషవాయువులకును, లెక్కచేయని కొన్ని కట్టడములు లండనునగరమున ఐదారు నెలలనుండి నిర్మింపబడుచున్నవి. అవి సరిగా పనిచేయునో లేదో చూచుటకు ఈ మధ్య ఇంగ్లీషు గవర్నమెంటువారు తమ విమానములచే లండనులోని ఒకవీధిమీద బాంబుల వర్షము కురిపించినారు. ఈశోధన అయినతరువాత నట్టికట్టడములు తృప్తిగానే యున్నవని గవర్నమెంటువారు స్థిరపరచుకొన్నారు. కొన్ని జంతువులను ఆకట్టడములలోపెట్టి అనేకవిధములైన విషవాయువులను కూడ వదలినారు. ఒక జంతువైనను మరణించలేదు.

* * * *

### రాబోయే యుద్ధంలో.

1914 మొదలు 1918 వరకునూ జరిగిన ఐరోపా మహాసంగ్రామములో మొత్తము 300 టన్నుల బాంబులు ఇంగ్లండుమీద వదలబడినవి. కాని ఈరోజులలో జరిగేయుద్ధాలలో ఒకరోజులోనే అంతకంటె ఎక్కువ టన్నుల బాంబులు

వదలుటకు వీలున్నదని సర్. శామ్యుయల్ హోరుగారు నుడివియున్నారు.

* * * *

ఏడుపులు, నవ్వులు.

"జనసామాన్యమునకు ఏడుపు సందర్భముల కంటె నవ్వు సందర్భములు 400 రెట్లు ఎక్కువగానుండును. మగవారికంటె ఆడువారు తక్కువగా నవ్వుదురుగాని, 3 రెట్లు ఎక్కువగా ఏడ్చెదరు." అని ఎలినోయ్ యూనివర్సిటీలోని సైకాలజీ ప్రొఫెసరుగారు కనుగొనినారట.

* * * *

దినమునకు 25 గంటలు.

జర్మనీలోని దశాంశ పద్ధతికి అనుగుణముగ నుండునట్లు సమకోణమును మామూలు ప్రకారము 90 డిగ్రీలు కాకుండా 100 డిగ్రీలుగా భాగించిన బాగుండునని జర్మనీ మంత్రిగారాలోచించు చున్నారట. వచ్చే సంవత్సరములోనే యిది అన్ని జర్మన్ స్కూళ్ళలో అమలులోనికి వచ్చునట్లు తెలియుచున్నది. దీనిని బట్టి ఆదేశములో సమబాహు త్రిభుజములోని ప్రతికోణమును 66 ⅔ ఉండును. దీనినిబట్టిలాంటిట్యూడ్, లాంగిట్యూడ్ కూడ మార్చుటే కాక దినమునకు 25 గంటలుగా కూడ మార్చవలసి యున్నది.

* * * *

విద్యరాని తనము నశించుట ఇక 2000ఏడ్లకు.

"ఈ 150 సంవత్సరముల బ్రిటిషు పరిపాలనలో మన హిందూదేశములోని విద్యరానితనము ఏరేటునశించు చున్నదో, ఆరేటుననే జరుగు చున్నయెడల పూర్తిగా విద్యరాని తనమును నిర్మూలించుటకు ఇక 20 శతాబ్దములుపట్టును" అని డాక్టరు ఆర్. యమ్. లోహియా గారు వ్రాయుచున్నారు.

* * * *

క్రొత్త ఫాషను.

ప్రస్తుతము సిగరెట్టు త్రాగునప్పుడు వచ్చు పొగ తెల్లగా నున్నది. ఇకముందు అనేక రంగులలో సిగరెట్టు పొగవచ్చునట్లుగా పాశ్చాత్య దేశములలో ఏర్పాట్లు కాబడు చున్నవట. ఏరంగు దుస్తుల ధరించిన వారా రంగు పొగరాగల సిగరెట్టులనే ఇకముందు వాడుట ఫాషనుగా మారగలదని తెలియుచున్నది.

---

# The Madras Elementary Education Act.

## Section 18.

సభల కార్యక్రమములు:—

(1) జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలు సభలలో జరిగిన విషయము లన్నియు, ప్రత్యేకముగా నుంచబడిన ఒక పుస్తకములో ఎప్పటికప్పుడు వ్రాయబడిన, ఆసభకు అధ్యక్షత వహించిన వారి వల్ల సంతకము చేయబడి, సక్రమమైన కాలములందు ఉచితముగా ఎవరి కవసరమైనవారు చూచుకొనుటకు వీలుగ కౌన్సిలు ఆఫీసులో నుంచబడవలెను.

(2) కౌన్సిలు సభలో జరిగిన విషయములు, జిల్లా గెజెట్‌లో ఇంగ్లీషునను తెలుగునను ప్రచురింపబడుటకు గాను అట్టిసభ జరిగిన 3 దినములలోగా జిల్లా కలెక్టరుకు పంపబడవలెను.

(3) కౌన్సిలుసభ జరిగిన ఒకవారములోగా కౌన్సిలు మెంబర్లందరకును, కౌన్సిలు ప్రాతినిధ్య మీయబడిన ప్రతిలోకల్ అథారిటీ తాలూకు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుకును, అట్టిసభలో జరిగిన కార్యక్రమమంతయు తెలియజేయ బడవలెను.

(4) పైనిచెప్పబడిన రికార్డుల కాపీలను ఉచితముగా గాని, కౌన్సిలు నిర్ణయించినఫీజు పుచ్చుకొని గాని, కౌన్సిలు స్థిరపరచిన వారికి ప్రెశిడెంటు లేదా ఆయనలేనప్పుడు వైస్ ప్రెశిడెంటు గ్రాంటు చేయవచ్చును.

## Section 19.

ప్రెశిడెంటుయొక్క అధికారము:—

1. (a) జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలులో నామోదింప బడిన తీర్మానము లన్నిటిని అమలు లోనికి తెచ్చు బాధ్యత ప్రెశిడెంటుదే యున్నది. కౌన్సిలు యొక్క సర్వమైన ఎగ్జిక్యూటివ్ అధికారములను ప్రెశిడెంటుకు చెందినవే అయివున్నవి. ఈయాక్టుకు చెందిన సర్వ విషయముల నాచరణ లోనికి తెచ్చు అధికార మాతనిదే అయియున్నది.

(b) ప్రత్యేకముగా కౌన్సిలు మాత్రమే చలాయించ వలెనని ఉదహరింపబడిన అధికారములను ప్రెశిడెంటు స్వయముగ చలాయించుట అక్రమము.

(c) ఈ యాక్టు ననుసరించి ప్రెసిడెంటు తానుచేయవలసిన విధులలో వేటినైనను లేదా, తాను చలాయించవలసిన అధికారములలో వేటినైనను వైస్ప్రెశిడెంటు చేయవలసినదని వ్రాత మూలకముగా హక్కునీయవచ్చును. అట్టి హక్కునిచ్చిన ఉత్తరువులను మార్చుటకుగాని, రద్దు చేయుటగాని ప్రెశిడెంటునకు అధికారముండును.

ఈవిధముగా తన అధికారమును, కొంత వదలుకొనిననూ, ఈయాక్టు ననుసరించి ప్రెశిడెంటు నకున్న బాధ్యతలు ప్రెశిడెంటునకేగాని తాత్కాలిక హక్కుచలాయించుచున్న వైస్ ప్రెశిండెటు నకు చెందవు.

2. (a) ప్రెశిడెంటు పోష్టు ఖాళీగా నుండుట తటస్థించిన, వైస్ ప్రశిడెంటున్నచో నాతడే క్రొత్త ప్రెశిడెంటు ఎన్నుకొనబడువరకు ప్రెశిడెంటుయొక్క హక్కులను అధికారములను చలాయించుట కర్హుడై యుండును.

(b) వరుసగా 30 దినములకు పైగా తన జ్యూరిస్ డిక్షనులో లేకపోవుట తటస్థించినప్పుడు గాని, తనపని తాను నెఱవేర్చుకొనలేని యే యితర యిబ్బంది వచ్చినప్పుడు గాని, వైస్ ప్రెశిడెంటు తమ కౌన్సిలు ప్రెశిడెంటునకును, జిల్లా కలెక్టరునకును రిజిష్టరు పోష్టులో నోటిసుల నిచ్చిన 3 దినముల తరువాత ప్రెశిడెంటు తిరిగి తనపని తాను నెఱవేర్చుకొనుటకు సిద్ధముగానుండు వరకునూ ఆయన హక్కులను, అధికారములను చలాయించుట కర్హుడైయుండును.

(c) పై పరిస్థితులలో వైస్ ప్రెశిడెంటు లేకపోవుట కూడ తటస్థించిన యెడల జిల్లా కలెక్టరు తానే స్వయముగ ఆయా హక్కులను, అధికారములను ప్రెశిడెంటుగాని, వైస్ ప్రెశి

డెంటుగాని ఎన్నుకొనబడువరకునూ, లేదా వారిలో నెవరైన తమ విధిని నెఱవేర్చుకొనుటకు సిద్ధముగా నుండునంతవరకునూ, చలాయించవలసియుండును.

## Section 20.

కౌన్సిలు కార్యక్రమమును గూర్చిన స్టాండింగు ఆర్డర్లు :—

ఈ యాక్టుకునూ, దీని నాచరణలో పెట్టుటకై గవర్నమెంటువారు తయారుచేసిన నిబంధనలకునూ లోబడి ప్రతి జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలునూ యీ క్రింది విషయములను గూర్చిన స్టాండింగు ఆర్డర్లను తామే స్వయముగ తయారుచేసుకొనవచ్చును:—

(i) కౌన్సిలు మీటింగులు జరుగు చోటును, కాలమును స్థిరపరచుట.

(ii) మెంబర్లకు మీటింగుల నోటీసులను పంపు విధానమును సూచించుట.

(iii) మీటింగులలో జరుగు ప్రొసిడింగుల విధానమును ఏర్పర్చుట.

(iv) కౌన్సిలు నెఱవేర్చవలసిన విధులను మెంబర్లకు పంచుట.

(v) ప్రత్యేకముగా కొంతమంది మెంబర్లతోగాని లేదా కొంతమంది మెంబర్లతోనూ మరికొంతమంది యితరులతోనూ గాని యేర్పరుపబడిన కమిటీల నెన్నుకొనుట, విధుల నిర్ణయించుట, కూడుటకును, పనిచేయుటకును విధానమును స్థిరపరచుట.

(vi) కౌన్సిలునకు జేరు విరాళములకు రసీదుల నిచ్చువారిని నియమించుట.

(vii) కౌన్సిలు జ్యూరిస్‌డిక్షనులోని పాఠశాలలను తణిఖీచేయుటకు మెంబర్లలోనే కొంతమంది నియమించుట, మరియు వాటికి సంబంధించిన అక్కౌంటులను, పుస్తకములను, రిజిష్టరులను, రిటర్నులను, రిపోర్టులను, తదితర కాగితములను అజమాయిషీ చేయుటకు కూడ మెంబర్లను నియమించుట.

(viii) ఇటువంటి యితర విషయముల నన్నిటిని స్థిరపరచుట.

## Section 21.

కౌన్సిలుచేసిన పనులను గవర్నమెంటువారు రద్దుచేయుట:—

గవర్నమెంటువారి యభిప్రాయములో ఏదైన కౌన్సిలు తీర్మానముగాని, తీర్మానము నమలులో పెట్టుపద్ధతిగాని ప్రెశిడెంటుయొక్క ఆర్డరుగాని, అతడు చేసినట్టియు, చేయబోవునట్టియు యేయితరపనిగాని, కౌన్సిలునకిచ్చిన అధికారమునకు మించినదైనయెడల, గవర్నమెంటువారు అట్టి తీర్మానమునుగాని, అమలులోపెట్టు పద్ధతినిగాని, ఆర్డరునుగాని, పనినిగాని రద్దుచేసినట్లుగా ఉత్తరువు లీయవచ్చును.

## Section 22.

కౌన్సిలుమీద గవర్నమెంటువారికి గల యితర యధికారములు:—

(1) జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలు తనవిధిని సరిగాగాని, సకాలమునకుగాని నెఱవేర్చలేదని గవర్నమెంటువారికి గోచరమైనయెడల, ఫలానా కాలములోపల ఆవిధిని కౌన్సిలు చేసితీరవలసినదిగా గవర్నమెంటువారు ఉత్తరువులు జారీచేయించవచ్చును.

(2) గవర్నమెంటు ఉత్తరువు ప్రకారము ఆ సూావిధులను, ఆయాకాలములలో కౌన్సిలు చేయజాలక పోయినయెడల, ఆవిధిని నెఱవేర్చుటకై గవర్నమెంటువారే ఎవరినైన ఒకరిని నిర్మించి అందులకగు ఖర్చులను వారు నిశ్చయించిన కాలములోపల చెల్లింపవలసినదిగా కౌన్సిలును కోర వచ్చును.

(3) కౌన్సిలు అట్టిఖర్చులను గవర్నమెంటువారు కోరినరీతిని చెల్లించనియెడల, 28 వ శెక్షను ననుసరించి ఎన్నుకొనబడిన కౌన్సిలుయొక్క కోశాధికారిని మిగత ఖర్చులన్నిటిని ఆపుచేసి పైని చెప్పబడ్డ ఖర్చులను ముందుగా చెల్లించవలసినదిగా ఆజ్ఞాపింపవచ్చును. ఆకోశాధికారి, కౌన్సిలుకు నిలవసొమ్ము ఉన్నంతమట్టుకు గవర్నమెంటువారి ఆజ్ఞకు లోబడవలెను.

## Section 23.

కౌన్సిలుయొక్క పునర్నిర్మాణము:—

జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలు ఈ సూాక్టుకు లోబడి తనవిధులను తాను సక్రమముగ నెఱవేర్చుకొనుట లేదని ఎప్పుడైనను గవర్నమెంటువారికి గోచరించనియెడల, ఎన్నుకొనబడినట్టియు నామినేషను చేయబడినట్టియు మెంబర్లందరను తీసివేసి అట్టిఖాళీలను క్రొత్త ఎన్నికలు, క్రొత్త నామినేషనులుచేసిగాని లేదా పూర్తిగా అందరిని నామినేషను చేసిగాని పూర్తిచేయువచ్చును.

## Section 24.

కౌన్సిలుయొక్క విధులు:—

(1) ఈదిగువ నుదహరింపబడిన వన్నియు జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలు చేయవలసిన విధులై యున్నవి.

(a) జిల్లా అంతటిలోని ఎలిమెంటరీస్కూళ్ళ జాపితాను తయారుచేయుట.

(b) ప్రస్తుతము విద్యావ్యాప్తికి తోడ్పడుచున్న ప్రదేశములను, ముందు యింతకంటె ఎక్కువగా విద్యవ్యాప్తమగుటకు ఏయే స్థలములలో పాఠశాల లవసరమో ఆయాస్థలములను సూచించు ప్లానులను, మ్యాపులను అంచనాలను తయారుచేయుట.

(c) జిల్లాలోని జిల్లాబోర్డులతోనూ, మ్యునిసిపాలిటీలతోనూ సంప్రదించి ప్రాథమికవిద్యా వ్యాప్తికి స్కీములను తయారుచేయుట.

(d) బోర్డులతోనూ, మ్యునిసిపాలిటీలలోనూ, జిల్లాలోని యితర విద్యాసంస్థలతోనూ సంప్రదించి, కౌన్సిలుఫండు వీలిచ్చినమట్టుకు ఉన్నతపాఠశాలలను అభివృద్ధిపరచుటకును, లేనిచోట్ల క్రొత్తపాఠశాలల స్థాపించుటకును తోడ్పడుట.

(e) 41 వ శెక్షనుప్రకారము స్కూళ్ళకు రికగ్నిషను గ్రాంటుచేయుట.

(f) 42 వ శెక్షనుక్రింద ప్రయివేటు మేనేజిమెంటుకుచెందిన పాఠశాలలుపెట్టుకొను గ్రాంటు దరఖాస్తులను విచారించి ఆర్డర్లు ప్యాసుచేయుట.

(g) ప్రయివేటు మానేజిమెంటులకు చెందిన ప్రాథమిక పాఠశాలల నిమిత్తమై శాంక్షను కాబడి, గవర్నమెంటువారిచే కౌన్సిలున కీయబడిన గ్రాంటుసొమ్మును, ఆయా మానేజిమెంటులకు పంచియిచ్చుట.

(h) ఎలిమెంటరీస్కూలు టీచర్లకు ట్రయినింగునిచ్చు జిల్లాలోని రికగ్నైజు కాబడిన పాఠశాలల జాపితాను తయారుచేయుట.

(i) ట్రయినింగును, సర్టిఫికెట్లును పొందినట్టి ఎలిమెంటరీ స్కూలుమాష్టర్ల రిజిష్టరును తయారుచేయుట.

(j) ట్రయినింగును, సర్టిఫికెట్లును పొందినమాష్టర్లు ఎక్కువగా అవసరమయిన యెడల అట్టివారిని సప్లయి చేయవలసినదిగా డైరెక్టరుగారిని కోరుట.

(k) డైరక్టరుగారు కోరినప్రకారము ఎలిమెంటరీ ఎడ్యుకేషనుకు చెందిన అన్నివిషయముల లోనూ వారికి సలహాలనిచ్చుట.

(2) పై 1 వ సబ్ సెక్షనులోనున్న (a) లోని జాపితాను (b) లో కోరినవాటిని ప్రతిజిల్లా బోర్డుకునూ, మ్యునిసిపాలిటీకిని వేఱువేఱుగ తయారుచేయవలెను.

---

# స్కౌటుసంగతులు.

## స్కౌటు ట్రినియల్ కాన్ఫరెన్సు.

ఢిల్లీలో వైస్రాయిగారి భవనమందు నవంబరు 16 వ తారీఖున 10-30 గంటలకు మొదటి అఖిలభారత స్కౌటు ట్రినియల్ కాన్ఫరెన్సు వైస్రాయిగారి ఉపన్యాసముతో ప్రారంభింపబడినది. అన్నిరాష్ట్రముల నుండియు ప్రతినిధులాసభకు విచ్చేసి యీక్రింది తీర్మానములను ఆమోదించినారు.

1. ప్రపంచపు ప్రధానవీరుడు హిందూదేశములోని స్కౌటింగునకుచేసిన గొప్పసేవను గుర్తించుచు, హిందూదేశపు బోయ్‌స్కౌటు అసోసియేషనును స్వతంత్రమైనదిగను, జాతీయమైనదిగను, ఉండుసంస్థగా మార్చి ఇంటర్నేషనల్ బీరోతో కలిపివేయవలెనని ఈసభవారుతీర్మానించుచున్నారు.

2. అన్నిరాష్ట్రములలోని స్కౌటు పనుల సంఘట్టనకునూ, ఒకేవిధమయినస్కౌటు ట్రయినింగు అన్నిరాష్ట్రములలోనీ యబడునట్లు చూచుటకునూ మాత్రమేగాని అఖిలభారత స్కౌటు కౌన్సిలు తదితర విషయములలో గలుగజేసికొనక ప్రతిరాష్ట్ర సంఘమునకునూ సెటింగుపట్ల పూర్తియైన స్వతంత్రము నీయవలెనని ఈసభవారు తీర్మానించుచున్నారు.

3. (a) రాష్ట్రసంఘములు గవర్నరులను ఛీఫ్ స్కౌట్లుగాగాని, పోషకులుగాగాని చేయవచ్చును.

(b) రాష్ట్రసంఘములు వారి యిష్టమువచ్చిన స్కౌటు ఆఫీసర్లను తమరాష్ట్రములోని స్కౌటు పనులకు నియోగించవచ్చును. కాని, సాధ్యమైనంతవరకు హిందూదేశస్థులనే స్కౌటు ఆఫీసర్లుగా చేయుట మంచిదని ఈసభవారి యభిప్రాయము.

4. ఈక్రింది పనులుచేయుటకై 2 వ తీర్మానము ననుసరించి అఖిలభారత స్కౌటు కౌన్సిలును ఎన్నుకొనవలెను:—

(a) ఈ తీర్మానముల పురస్కరించుకొని క్రొత్త స్కౌటు నిబంధనలను తయారుచేయుటకును,

(b) ఇంటర్నేషనల్ స్కౌటుబీరోతో కలుపుకొనవలసినదిగా దరఖాస్తు పెట్టుటకును,

(c) ఈ మార్పులవల్ల హిందూదేశపుప్రధాన వీరుడుగా నుండిన వైస్రాయి గారికి స్కౌటంగుతో ముండెట్టి సంబంధ ముండవలెనో వారితోనే సంప్రదించుటకును,

(d) క్రొత్త నిబంధనల తయారు చేయుటకు పూర్వమే యితర స్కౌటు సంస్థలతో . దేశములో నొకే స్కౌటు సంస్థను నెలకొల్పుటను గూర్చి సంప్రదించుటకును.

స్కౌటు రౌండు టేబిల్ కాన్ఫరెన్సు.

అలహాబాదులో సేవాసమితి స్కౌటు అసోసియేషను వారి యాజమాన్యమున నవంబరు 28, 29 తారీఖులలో స్కౌటు రౌండు టేబిల్ కాన్ఫరెన్సు జరుపబడినది. బేడెన్ పవలు అసోసియేషనుకు చెందిన రాష్ట్రప్రతినిధులునూ, సేవాసమితికి చెంది. రాష్ట్రప్రతినిధులునూ కాన్ఫరెన్సుకు వచ్చియుండిరి. పై రెండు సంఘముల ఛీఫ్ కమిషనర్లైన చటారీ నవాబుగారునూ, సంగీత హృదయనాథ్ కుంజ్రుగారును వేదికపై నెక్కి కాన్ఫరెన్సును అతి జయప్రదముగా సాగించినారు. రెండుపక్షముల నాయకులునూ హృదయముల విప్పి సంఘీభావ మవసరమని ఉపన్యాసముల నిచ్చిరి. స్వతంత్రమైనట్టియు, జాతీయమైనట్టియు, ఒకే స్కౌటు సంస్థ ఇండియాకంతకును ఉండి తీరవలెనని తీర్మానింపబడినది. స్కౌటు ప్రమాణములో 'రాజు' అను శబ్దమును 'స్టేట్' అని మార్చుటలో చాలా అభిప్రాయభేదములు వచ్చి చివరకు 'స్టేట్' లేక 'క్రౌను' అను మాటలలో నొకదానిని ఆయా రాష్ట్ర సంఘముల యిష్ట ప్రకారము వాడుటకు తీర్మానింపబడినది. క్రొత్త నిబంధనలను తయారుచేయుటకు ఒక సబ్ కమిటీ ఎన్నుకొనబడినది. ఈస్టరు శెలవలలో మరియొక రౌండు టేబిల్ కాన్ఫరెన్సు జరుగుననియు, అందు సబ్ కమిటీ వారి నూతన నిబంధనలు చర్చింపబడుననియు తెలియుచున్నది.

సారాంశము.

మన దేశములోని అందరు స్కౌట్లునూ, స్కౌటు మాష్టర్లునూ పై రెండు సభలలో నేమి జరుగబోవునో యని భయపడినారు. కాని ఆ సభల తీర్మానములందరికిని మిక్కిలి తృప్తికరముగా నున్నవనుటలో సందేహములేదు. మద్రాసు రాష్ట్ర స్కౌటు శాఖవారు వైస్రాయిగారి సందేశమునకు కూడ లోబడక తమ శాఖను వేరుపరచి క్రొత్తనిబంధలనను మొండి ధైర్యముతో అమలులో పెట్టినారు. కాని, సరిగా వారు చూపిన దారినే ఈ రెండు సభలును జరిగియుండుట మిక్కిలి ఆశ్చర్యకరముగ నున్నది. 3 నెలల క్రితము మద్రాసు స్కౌటు శాఖ చేసిన తీర్మానములవంటివే పై రెండు అఖిలభారత స్కౌటు కాన్ఫరెన్సులలోనూ ఆమోదింపబడినవి.

ఇక ముందు దేశమున కంతకును ఒకే స్కౌటు సంస్థ ఉండును. అది జాతీయముగనూ, స్వతంత్రముగనూ ఉండును. ఇంగ్లండులోని ఇంపీరియల్ సంస్థతో సంబంధముండదు. స్కౌట్లకు క్రొత్తనిబంధనలు మన దేశములోనే తయారు కాబడును. ఇకముందు స్కౌటు సంస్థతో గవర్నమెంటు ఆఫీసర్ల జోక్యముండదు. ఇతర దేశములన్నియు మనదేశపు స్కౌటు సంస్థను రికగ్నైజు చేయుటకుగాను మనదేశపు స్కౌటు సంస్థ ప్రత్యేకముగా ఇంటర్నేషనల్ బీరోతో చేర్పబడును.

---

# రామా పద్యవాచకములు.

కె హెచ్. వి యస్ నారాయణ, బి ఏ, యల్ టి
శేషాద్రిరమణకవులు, శతావధానులు గార్లచే

| | |
|---|---|
| మొదటి తరగతి | 0 1 6 |
| రెండవ తరగతి | 0 1 6 |
| మూడవ తరగతి | 0 2 0 |
| నాల్గవ తరగతి | 0 2 0 |
| ఐదవ తరగతి | 0 2 6 |

చిన్నకోట వెంకట రంగారావు బి ఎ, ఎల్ టి, గారిచే

| | |
|---|---|
| ఆఱవ తరగతి | 0 3 0 |
| ఏడవ తరగతి | 0 4 0 |
| ఎనిమిదవ తరగతి | 0 6 0 |

# రామా గణితదర్పణములు.

గిడుగు వేంకటరామమూర్తి, బి ఎ ఎల్ టి
తోపల్లి వెంకటప్పయ్యా, బి ఎ ఎల్ టి గార్లచే వ్రాయబడి
(యస్ గోపాలం బి ఎ ఎల్ టి గారిచే రివైజు చేయబడినవి)

| | |
|---|---|
| మొదటి తరగతి | 0 3 0 |
| రెండవ తరగతి | 0 5 0 |
| మూడవ తరగతి | 0 7 0 |
| నాల్గవ తరగతి | 0 10 0 |
| ఐదవ తరగతి | 0 12 0 |



# రామాహితోపదేశ వాచకములు.

విద్వాన్ గరిమెళ్ళ సోమన్న పంతులుగారు, యం ఎ యల్ టి గారిచే

| | |
|---|---|
| రెండవ తరగతి | 0 2 0 |
| మూడవ తరగతి | 0 3 0 |
| నాల్గవ తరగతి | 0 4 0 |
| ఐదవ తరగతి | 0 5 0 |

# రామా సివిక్సు పాఠములు.

బి లక్ష్మీనారాయణశాస్త్రి, ఎం ఏ (ఆనర్సు) ఎల్ టి గారిచే

| | |
|---|---|
| రెండవ తరగతి | 0 2 6 |
| మూడవ తరగతి | 0 3 0 |
| నాల్గవ తరగతి | 0 4 0 |
| అయిదవ తరగతి | 0 5 0 |

మహాకాళి సుబ్బారాయుడు గారిచే

| | |
|---|---|
| సివిక్సు వ్యాస్యయలు 4, 5, తరగతులకు | 0 6 0 |

# రామా ప్రకృతి శాస్త్రవాచకము.

Dr. వేపా వరాహ నరసింహంగారు, యం ఏ,
తెంపెల్లి సూర్యనారాయణమూర్తిగారు, డి ఐ ఆఫ్ స్కూల్సు గారిచే

| | |
|---|---|
| రెండవ తరగతి | 0 3 0 |
| మూడవ తరగతి | 0 4 0 |
| నాల్గవ తరగతి | 0 5 0 |
| ఐదవ తరగతి | 0 6 0 |

## రామా గుణిత బోధినీలు.

ప్రాథమిక పాఠశాలల తరగతుల బాలురకు వర్ణక్రమమును నేర్పుట
కీపుస్తకములు మిగుల యుపయుక్తములు

| | | |
|---|---|---|
| మొదటి భాగము | .. | 0 1 6 |
| రెండవ భాగము | | 0 2 0 |
| మూడవ భాగము | | 0 2 0 |
| నాల్గవ భాగము | .. | 0 2 0 |

## రామా పురాణపాఠములు.

మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారిచే
డాక్టరు వేపా వరాహనరసింహము పంతులు, ఎం ఎ, గారిచే
పరిష్కరింపబడినవి

| | |
|---|---|
| మొదటి తరగతి | 0 2 6 |
| రెండవ తరగతి | 0 2 6 |
| మూడవ తరగతి | 0 3 0 |
| నాల్గవ తరగతి | 0 4 0 |
| ఐదవ తరగతి | 0 5 0 |

## రామా లోకజ్ఞానములు.

గిడుగు వేంకట రామమూర్తిగారు, బి ఏ, యల్ టి, గారిచే.

| | | |
|---|---|---|
| రెండవ తరగతి | .. | 0 3 0 |
| మూడవ తరగతి | .. .. | 0 4 0 |
| నాల్గవ తరగతి | . | 0 5 0 |
| అయిదవ తరగతి | . | 0 8 0 |
| 2. 3. 4 తరగతులకు ఒకేబుక్కు | .. | 0 10 0 |



## రామా జిల్లా భూగోళములు.

విద్వాన్ గరిమెళ్ళ సోమన్న పంతులు, ఎం ఏ, ఎల్ టి, గారిచే

విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, కర్నూలు, కడప, బళ్ళారి, అనంతపురం, చిత్తూరు, జిల్లాల భూగోళములు ప్రతిజిల్లా భూగోళం 1కి 0 4 0

క్రొత్తపద్ధతి ననుసరించి
మండలేముల వెంకటశాస్త్రి బి ఏ, ఎల్ టి గారిచే

1 గంజాంజిల్లా భూగోళము 0 4 0

ఉ సత్యనారాయణ డిప్యూటి ఇన్‌స్పెక్టరు, యం ఏ, ఎల్ టి గారిచే.

2 విశాఖపట్నంజిల్లా భూగోళం 0 6 0

ఫార్లి రాఘవేంద్రరావు, బి ఏ, గారిచే

3 తూర్పుగోదావరి జిల్లాకథ 0 6 0

డి సత్యనారాయణమూర్తిగారిచే, బి ఏ, ఎల్ టి,

4 పశ్చిమ గోదావరి జిల్లాభూగోళం 0 6 0

5 గుంటూరుజిల్లా భూగోళం 0 4 0

యస్ లక్ష్మీనరసయ్యగారు యం ఏ, ఎల్ టి, గారిచే

6 కర్నూలుజిల్లా భూగోళం . 0 4 0

యం వెంకటసుబ్బయ్య గారిచే,

7 కడపజిల్లా భూగోళం 0 4 0

మండా కృష్ణమూర్తి గారిచే.

8 ఏజన్సీభూగోళం 0 4 0

## రామా నాటకముల కథలు.

వి సుబ్బారాయుడు & యమ్ సుబ్బారాయుడు గార్లచే,

| | | | |
|---|---|---|---|
| మొదటి తరగతి | 0 2 0 | నాల్గవ తరగతి | 0 4 0 |
| రెండవ తరగతి | 0 2 0 | ఐదవ తరగతి | 0 5 0 |
| మూడవ తరగతి | 0 3 0 | | |

## జాగ్రఫీలు.

ఆర్ శేషగిరిరావు, బి ఏ, యల్ టి గారిచే

| | |
|---|---|
| మొదటిఫారం 6 వ తరగతికి .. | 0 8 0 |
| రెండవఫారం 7 వ తరగతికి | 0 10 0 |
| మూడవఫారం 8 వ తరగతికి | 0 12 0 |

నాల్గవ ఫారమునకు, (బి రామచంద్రరావు, ఎమ్ ఏ, ఎల్ టి గారిచే) యం సీతారామాచార్యులు, బి ఎ, ఎల్ టి, గారిచే వ్రాయబడిన

| | |
|---|---|
| చెన్నపురి రాజధాని భూగోళం | 0 6 0 |

## రామాజాగ్రఫీ మ్యాపుడ్రాయింగు బుక్కులు.

(నవీన పద్ధతులననుసరించి నూతన ప్రణాళికొను గుణ్యముగ తయారు చేయబడినవి)

| | | | |
|---|---|---|---|
| 5 వ తరగతికి | 0 3 0 | 3 వ ఫారము | 0 6 0 |
| 1 వ ఫారము | 0 6 0 | ట్రయినింగు స్కూళ్ళకు | 0 6 0 |
| 2 వ ఫారము | 0 6 0 | | |

## రామా గణిత సారములు.

ఆర్ వీరభద్రరావు బి ఏ, ఎల్ టి, గారిచే వ్రాయబడి

(కె వి సుబ్బారావు బి ఏ, యల్ టి గారిచే రివైజు చేయబడినవి)

| | |
|---|---|
| నాల్గవ తరగతి ... | 0 8 0 |
| అయిదవ తరగతి | 0 10 0 |
| తెలుగు లెక్కలబుక్కు (పుట్లు, వెరసులవగైరా) | 0 4 0 |
| నోటిలెక్కలబుక్కు 2-5 తరగతుల వరకు | 0 4 0 |
| గణితబోధిని (ఎక్కములు, మానములు) | 0 1 0 |



## రామా తాలూకా భూగోళములు.

| | |
|---|---|
| తిరువూరు తాలూకా భూగోళం | 0 3 0 |
| తెనాలి తాలూకా చరిత్ర భూగోళం | 0 3 0 |
| బాపట్ల తాలూకా చరిత్ర భూగోళం | 0 2 6 |
| గుంటూరు తాలూకా చరిత్ర భూగోళం | 0 2 6 |
| గుత్తి తాలూకా భూగోళం | 0 2 6 |
| కంభం తాలూకా భూగోళం | 0 3 0 |
| ఏలూరు తాలూకా భూగోళం | 0 2 6 |
| నంద్యాల తాలూకా భూగోళం | 0 2 0 |

## రామా హిందూదేశ చరిత్రలు.

పురిటి రామమూర్తి గారిచే వ్రాయబడి,

జి రంగారావునాయుడు, బి ఎ, ఎల్ టి గారిచే సరిచూడబడినవి

| | |
|---|---|
| రామా హిందూదేశ చరిత్ర 4 త॥ | 0 4 0 |
| హిందూదేశ చరిత్ర 5 త॥ | 0 5 0 |

జి వి. సీతాపతి, బి ఏ, ఎల్ టి, గారిచే

| | |
|---|---|
| మొదటి ఫారం 6 వ తరగతికి | 0 8 0 |
| రెండవ ఫారం 7 వ తరగతికి | 0 10 0 |
| మూడవ ఫారం 8 వ తరగతికి | 0 12 0 |

మునిమాణిక్యం నరసింహారావు, బి ఎ, ఎల్ టి గారిచే

| | |
|---|---|
| కృష్ణామండల చరిత్ర | 0 3 0 |

## ప్రథమ పాఠశాలారోగ్య బోధిని.

శిష్టా గోపాలం బి ఎ, ఎల్ టి గారిచే వ్రాయబడినది

| | |
|---|---|
| 2, 3 తరగతులకు | 0 2 0 |
| 4, 5 తరగతులకు | 0 4 0 |

# తెలుగు టెక్స్టు బుక్కు ఆఫ్ అరిథ్ మెటిక్.

యస్ రాధాకృష్ణఅయ్యర్, బి ఏ,

కే వైద్యనాధస్వామి అయ్యర్, బి, ఎ గార్లచే, (కె రంగాచారి

ఎం ఏ బి యల్ యల్ టి విజయనగరము వారిచే సవరింపఁబడినవి)

| | |
|---|---|
| మొదటి ఫారమునకు | 0 10 0 |
| రెండవ ఫారమునకు .. | 0 10 0 |
| మూడవ ఫారమునకు | 0 10 0 |

జే గంగాధరం బి ఏ ఎల్ టి గారిచే

| | |
|---|---|
| నాల్గవ ఫారమునకు | 1 0 0 |

## ఉపాఖ్యానములు - నిఘంటువులు.

| | |
|---|---|
| నీతిశాస్త్రము టీక | 0 2 0 |
| ఆంధ్రనామసంగ్రహము | |
| మూలము | 0 2 0 |
| డిటో టీక | 0 6 0 |
| ఆంధ్రనిఘంటుత్రయము | |
| రేపరు | 0 8 0 |
| డిటో అట్ట | 0 10 0 |
| డిటో క్యాలికో | 0 14 0 |
| ప్రహ్లాద చరిత్ర సప్తమ | |
| స్కంధము | 0 6 0 |
| కుచేలోపాఖ్యానము (పోతన) | |
| డిటో టీక | 0 4 0 |
| నలోపాఖ్యానము టీక | 0 6 0 |
| కుచేలోపాఖ్యానము | |
| (గట్టుప్రభువు) | 0 6 0 |
| భర్తృహరిసుభాషితము | |
| (నీతిశతకము) | 0 4 0 |
| అమరకోశము ప్రదమకాండము | |
| మూలము | 0 2 0 |
| డిటో డిటో టీక | 0 6 0 |
| అమరము త్రికాండము అట్ట | 1 0 0 |
| డిటో క్యాలికో | 1 12 0 |
| మొల్లరామాయణము | 0 8 0 |
| ధర్మసూక్ష్మము | |
| (పద్యకావ్యము) | 0 4 0 |



# రామా శాస్త్ర వాచకములు.

టి వి నరసింగరావు ఎమ్, ఎ ఎల్ టి ప్రొఫెసర్

బి హెచ్ పట్టాభిరామయ్య యం ఏ యల్ టి

సి భానుమూర్తి బి ఏ యల్ టి గార్లచే

| | |
|---|---|
| మొదటి ఫారము | 0 8 0 |
| రెండవ ఫారము | 0 8 0 |
| మూడవ ఫారము | 0 10 0 |

## రామా ఆంధ్రవ్యాకరణ ఫారములు.

యన్ సి హెచ్ వెంకట రామానుజాచార్యులు గారిచే

| | |
|---|---|
| 4, 5 తరగతులకు | 0 3 0 |
| 1 వ ఫారమునకు | 0 4 0 |
| 2 వ ఫారమునకు | 0 4 0 |
| 3 వ ఫారమునకు | 0 4 0 |
| రామా ఆంధ్రవ్యాకరణ సర్వస్వము 4, 5, 6 ఫారములకు శేషాద్రి రమణ కవులచే | 0 10 0 |
| కర్త కర్మ క్రియాబోధిని | 0 0 6 |
| భాషాభాగ ప్రదీపిక | 0 0 6 |

ట్రయినింగు స్కూళ్ళ పుస్తకములు

| | |
|---|---|
| భూగోళశాస్త్రము (నూతనసిలబసు ననుసరించి) | 1 4 0 |
| లెక్కల పుస్తకము | 2 0 0 |
| న్యాచురలు ఫనామినా | 0 8 0 |
| ఎలిమెంటరీ సైన్సు | 0 8 0 |
| సృష్టివిద్య-తోటపని (వృక్షశాస్త్రము, జంతుశాస్త్రము & న్యాచురలు ఫినామినా కలిసి) | 1 4 0 |
| ఆంధ్రలక్షణ చంద్రిక | 0 5 0 |
| సోషియాలజీ | 0 12 0 |
| పాఠక్రమ సూచిక | 0 8 0 |
| విద్యాబోధనా తత్వము | 0 12 0 |

## వివిధగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| అక్షరాభ్యాస సహకారికా చిత్రలేఖనము, మొదటిభాగం | 0 | 2 | 0 |
| డిటో రెండవ భాగం | 0 | 2 | 0 |
| మృగముల డ్రాయింగు బుక్కు | 0 | 2 | 0 |
| పక్షుల డ్రాయింగు బుక్కు | 0 | 2 | 0 |
| తెనాలి రామలింగని వింతకథలు | 0 | 3 | 0 |
| వ్యవహారబోధిని మొదటిభాగం | 0 | 4 | 0 |
| డిటో రెండవభాగం | 0 | 4 | 0 |
| సృష్టిపరిశీలన (సేపూరి లక్ష్మీనరసయ్యగారిచే | 0 | 4 | 0 |
| ఇంగ్లీషు గృహోపాధ్యాయుడు Private Tutor of English) | 0 | 4 | 0 |
| ఇంగ్లీషు కొన్వరుశేషను 4 త॥ | 0 | 3 | 0 |
| డిటో 5 త॥ | 0 | 4 | 0 |
| రామేశ్వర మజిలీకథలు | 0 | 12 | 0 |
| ఉత్తరరామోత్తరఖండము–హరికథ | 1 | 0 | 0 |
| రామకృష్ణజంత్రి 1, 2, 3, భాగములు | 2 | 0 | 0 |
| డిటో 3 వ భాగముమాత్రము | 0 | 8 | 0 |
| కుశలవ నాటకము | 0 | 12 | 0 |
| భగవద్గీత క్యాలికో బైండు–తాత్పర్యముతో | 0 | 8 | 0 |
| డిటో సాదా బైండు | 0 | 6 | 0 |
| అధ్యాత్మ రామాయణ కీర్తనలు | 0 | 6 | 0 |
| డిటో క్యాలికో బైండు | 0 | 10 | 0 |



| | | | |
|---|---|---|---|
| లలిత సహస్రనామము | 0 | 6 | 0 |
| డిటో క్యాలికో బైండు | 0 | 8 | 0 |
| శ్రీరామసహస్రనామస్తోత్రము | 0 | 4 | 0 |
| విష్ణుసహస్రనామస్తోత్రము | 0 | 4 | 0 |
| శ్రీలక్ష్మీ సహస్రనామస్తోత్రము | 0 | 3 | 0 |
| శ్రీఆంజనేయ సహస్రనామస్తోత్రము | 0 | 3 | 0 |
| శ్రీశివసహస్రనామస్తోత్రము | 0 | 3 | 0 |
| శ్రీగణపతిసహస్రనామస్తోత్రము | 0 | 3 | 0 |
| లక్ష్మీ నృసింహస్తోత్రము టీక | 0 | 3 | 0 |
| భజగోవిందం | 0 | 2 | 0 |
| మోక్షగుండరామాయణం (హరికథ) | 2 | 8 | 0 |
| అష్టాదశ పురాణసారము 1, 2, 3 4 భాగములు భాగము 1 కి | 1 | 0 | 0 |
| అన్ని భాగములు కలిపి క్యాలికో | 4 | 8 | 0 |
| హస్తసాముద్రికము | 0 | 4 | 0 |
| శ్రీమదాంధ్ర మహాభారతము (వచనము) ఆది–సభాపర్వములు | 2 | 0 | 0 |

### మున్నంగి శర్మగారి పరిష్కృతములు.

| | | | |
|---|---|---|---|
| భాషీయదండకము | 0 | 2 | 0 |
| చంద్రశేఖరశతకము | 0 | 2 | 0 |
| ఉద్భ్రాంత స్వప్నము | 0 | 2 | 0 |
| శ్రీమదాంధ్ర మహాభారతము (వాక్యవిరామాదుల తెలుపు గుర్తులతో) శాంతిపర్వము | 2 | 0 | 0 |

# సెకండరీస్కూళ్ళు



## ఉపవాచకములు.

| | | | |
|---|---|---|---|
| నీతికథామంజరి 2, 3, 4, త॥ | 0 2 0 | యదువంశము | 0 8 0 |
| ఆంధ్రరాజులు | 0 3 0 | రఘువుల వీరులు | 0 8 0 |
| ఆంధ్రులు | 0 3 0 | దశావతారములు (బొమ్మలతో) | |
| ఉపాఖ్యాన రత్నావళి | 0 3 0 | ... | 0 8 0 |
| భోజ చరిత్ర | 0 4 0 | షట్చక్రవర్తులు | 0 8 0 |
| పర్వదినమహాత్మ్యము | 0 4 0 | పరశురాముని చరిత్ర | 0 8 0 |
| జాతీయకథావళి | 0 4 0 | రామాయణసారము | 0 8 0 |
| ప్రహ్లాద చరిత్ర | 0 4 0 | ఉత్తర రామాయణసారము | 0 8 0 |
| భీష్మమహిమ | 0 5 0 | రాజసూయము | 0 8 0 |
| పురాణచంద్రిక I భా॥ | 0 4 0 | ప్రతాపరుద్రుడు | 0 8 0 |
| డిటో II భా॥ | 0 6 0 | చారిత్రనాటకపంచకం | 0 8 0 |
| కథారామాయణము | 0 6 0 | గద్యపద్యావళి | 0 8 0 |
| అభిమన్యుడు | 0 6 0 | కృష్ణవేణి | 0 8 0 |
| అజ్ఞాతవాసము | 0 6 0 | భారతసారము | 0 10 0 |
| నీతిచంద్రిక | 0 6 0 | భాగవతకథాసారము | 0 10 0 |
| రణతిక్కన చరిత్ర | 0 6 0 | తిన్నఁడు గుణనిధి | 0 10 0 |
| రుద్రమదేవి | 0 6 0 | బృహన్నల విజయము | 0 10 0 |
| శ్రీరామచంద్రమూర్తి | 0 6 0 | కల్పలత | 0 10 0 |
| కర్ణునిచరిత్ర | 0 8 0 | ఇందుమణి (నవల) | 0 12 0 |
| భీష్మచరిత్ర | 0 8 0 | హరివంశము | 0 12 0 |
| కురువంశము | 0 8 0 | పోటీపరీక్షావ్యాసములు | 1 0 0 |



## బాలుర కుపయుక్తమగు శతకములు.

| | | | |
|---|---|---|---|
| సుమతిశతకము మూలము | 0 1 0 | నృసింహశతకం టీక | 0 4 0 |
| డిటో టీక | 0 2 0 | వేమన శతకము మూలము | 0 1 0 |
| కృష్ణశతకము మూలము | 0 1 0 | డిటో టీక | 0 3 0 |
| డిటో టీక | 0 3 0 | బాలరామాయణము టీక | 0 2 0 |
| కుమారశతకము మూలము | 0 1 6 | డిటో మూలం | 0 1 0 |
| డిటో టీక | 0 3 0 | గజేంద్రమోక్షము మూలము | 0 2 0 |
| దాశరధీశతకము మూలము | 0 1 0 | డిటో టీక | 0 6 0 |
| డిటో టీక | 0 4 0 | డిటో క్యాలికోబైండు | 0 8 0 |
| భాస్కర శతకం మూలము | 0 1 0 | రుక్మిణీకల్యాణం మూలము | 0 2 0 |
| డిటో టీక | 0 4 0 | డిటో టీక | 0 6 0 |
| నృసింహశతకం మూలము | 0 1 6 | డిటో క్యా॥ బైండు | 0 8 0 |

స్త్రీలకుపయుక్తమగు ఉపవాచకములు, శతకములు.

## సతీశిరోమణులు.

మహావాది వెంకటరత్నంగారిచే.

| | | | |
|---|---|---|---|
| అభ్యాసపారం | 0 2 6 | నోముల కదలు | 0 4 0 |
| సతీశిరోమణులు 1 భా॥ | 0 3 0 | కుమారశతకము | 0 1 0 |
| ,, 2 భా॥ | 0 3 0 | డిటో టీక | 0 2 0 |
| ,, 3 భా॥ | 0 4 0 | సుదతీ సునీతిశతకము | |
| ,, 4 భా॥ | 0 5 0 | మూలము | 0 1 6 |
| ,, 5 భా॥ | 0 6 0 | డిటో టీక | 0 3 0 |
| ,, 6 భా॥ | 0 6 0 | పూర్వహైందవ స్త్రీలచరిత్ర | |
| ,, 7 భా॥ | 0 6 0 | మొదటిభాగము | 0 3 0 |
| ,, 8 భా॥ | 0 6 0 | డిటో రెండవభాగం | 0 3 0 |
| ,, అభ్యాసవాచకం | 0 2 0 | రామా తెలుగుకాపీలు 1,2,3,4,5 | |
| భారతనారీమణులు | 0 6 0 | సెంబర్లు ఒక్కొకటి | 0 0 9 |
| అనసూయ | 0 4 0 | డజను 0-7-0 1గ్రోసు | 4 8 0 |

# స్కూల్ల రిజిష్టర్లు.

| | | | |
|---|---|---|---|
| అటెండెన్సు రిజిష్టరు | 12 పే॥ | ... | 0 2 0 |
| డిటో డిటో | 24 పే॥ | ... | 0 4 0 |
| డిటో డిటో | 36 పే॥ | ... | 0 6 0 |
| డిటో డిటో | 48 పే॥ | ... | 0 8 0 |
| డిటో డిటో | 60 పే॥ | ... | 0 10 0 |
| డిటో డిటో | 72 పే॥ | ... | 0 12 0 |
| డిటో డిటో | 84 పే॥ | ... | 0 14 0 |
| డిటో డిటో | 1.0 పే॥ | ... | 1 0 0 |
| అడ్మిషను రిజిష్టరు | 12 పే॥ | ... | 0 2 0 |
| డిటో | 24 పే॥ | ... | 0 4 0 |
| అడ్మిషను ఫారములు | 100 పే॥ | ... | 0 8 0 |
| టీచర్ల అటెండెన్సు రిజిష్టరు | నెం 1 రు | ... | 0 2 0 |
| డిటో | నెం 2 రు | ... | 0 3 0 |
| డిటో | నెం 3 రు | ... | 0 4 0 |
| ప్రోగ్రెస్ కాండక్టు రిజి॥ | 50 పే॥ | ... | 0 3 0 |
| డిటో రిజి॥ | 100 పే॥ | ... | 0 5 0 |
| డిటో రిజి॥ | 150 పే॥ | ... | 0 7 0 |
| డిటో రిజి॥ | 200 పే॥ | ... | 0 9 0 |
| లీవింగు సర్టిఫికెట్టు బుక్కు 25 ఫారములు డూప్లికేటుతో | | | 0 2 0 |
| డిటో 50 ఫారములు డిటో | | ... | 0 4 0 |
| అక్విటెన్సు రోలు | | ... | 0 3 0 |
| విజిటర్సు బుక్కు | | ... | 0 3 0 |
| ఫారెస్టు నమోనా రశీదు బుక్కు | నెం 2 రు 50 పే॥ | | 0 6 0 |
| జనాభా రిజిష్టరు 50 పేజీలు | | ... | 0 6 0 |
| డిటో డిటో | 100 పే॥ | ... | 0 12 0 |
| డిటో డిటో | 150 పే॥ | ... | 1 2 0 |
| డిటో డిటో | 200 పే॥ | ... | 1 6 0 |



# రామా బొమ్మలపటములు. సైజు" 10 × 15"

18 జంతువులు, 10 పక్షులు, 4 వృక్షములు, 3 పాములు, 3 పుష్పములు, 2 జల, 3 భూచర, సరీసృపములు. (మొత్తం 43)

సృష్టిపరిశీలనా పాఠములు బోధించుటకు మిక్కిలి సహాయపడును. ప్రతిబడికిని ముఖ్యావసరము. ప్రతి పటమునకును సంగ్రహచరిత్ర క్లుప్తముగ వ్రాయబడినది. బడిగోడలకువేసిన అందముగ నుండును.

| | | | |
|---|---|---|---|
| ఒక్కొక్క పటము | 0 1 0 | 43 పటముల పూర్తి సెట్టు | 2 0 0 |
| డజను | 0 9 0 | డిటో బైండుచేసిన పుస్తకములు | 2 4 0 |

స్వాభావిక సిద్ధములైన ప్రకృతి దృష్టాంతములను. నీతులను తెల్పుచూ అట్టివానిలో ముఖ్యమగు యీక్రింద పేర్కొనిన వానిని పెద్ద అక్షరములతో గ్లేజు కాగితముల పైన ప్రత్యేకము ప్రాథమిక బడుల బాలబాలికల ప్రస్తుత విద్యావిధానమున కుపకరించునట్లు తయారు చేయించితిమి.

[10" × 15" మరియు 15" × 20" సైజులలో ముద్రింపబడినవి.]

| | |
|---|---|
| 1. పంచరంగులు | 4 మాతృపంచకము |
| 2. షడ్రసములు | 5 నవరసములు |
| 5. అష్టకష్టములు | 6 నవధాన్యములు |

ఒక్కొక్కటి 0—0—9 సెట్టు 0 — 3— 0

ఈక్రిందిసెట్టు ముద్రింపబడి సిద్ధముగా నున్నవి.

| | |
|---|---|
| 6 నీతివాక్యములు | 6 విధులు |
| 6 వ్యవసాయ సామెతలు | 12 ఆరోగ్యసూత్రములు |
| 6 నిత్యకృత్యములు | 12 నీతులు |

పై 48 నీతిసూత్రములసెట్టు గ్లేజుకాగితములపైన 0-8-0

వలయువారు:— రామా అండ్ కో., ఏలూరు.

# Andhra Rashtra Prarambha Vidya.

This is one of the Telugu Educational monthly magazines widely read and appreciated by a large section of the Educational Officers. Advertisements both in English and Telugu will be thankfully accepted. The rates of advertisement are very moderate and Advertisers can insure popularity and success in their business by getting their advertisements published in this renowned Educational Review.

## RATES OF ADVERTISEMENT.

| | Full Page. | Half-a-Page. | One-Fourth Page. |
|---|---|---|---|
| For one month .... | 5—0—0 | 3—0—0 | 2—0—0 |
| For three months | 13—8—0 | 8—8—0 | 5—8—0 |
| For six months ... | 25—0—0 | 15—0—0 | 10—0—0 |
| For one year .... | 48—0—0 | 28—0—0 | 18—0—0 |

*N.B*:— An extra charge of Re. 1—0—0 for insertion of the advertisement on the title page.

Contract Rates on application.

**Apply sharp to:—**

**Messrs. RAMA & Co.,**

ELLORE.

## మా కంపెనీలో

స్టూడెంటు నోటు బుక్కులు చిన్న డ్రాయింగుబుక్కులు, పెద్దడ్రాయింగు బుక్కులు, పాకెట్టు నోటు బుక్కులు, ఎక్సర్ సైజు బుక్కులు, గ్రాఫ్‌నోటు బుక్కులు, అన్ని రకముల బైండ్లు, అట్టెండెన్సు రిజిష్టర్లు, రఫ్ నోటు బుక్కులు, తెలుగు కాపీలు, ఇంగ్లీషు కాపీలు, యింకను అన్ని రకముల స్టేషనరీ సామానులు మిక్కిలి సరస మైన ధరలకు దొరకును.

రామా అండ్ కో., ఏలూరు.